# తొలిపలుకులు

ప్రపంచమునఁ గల మానవులు తమకుఁ గల సమస్తదుఃఖములు నివృత్తి కావలయు ననియు, శాశ్వతానందము ప్రాప్తింపవలయు ననియుఁ గోరుచున్నారు. కాని యా దుఃఖము లెట్లు వచ్చినవో, యెట్లు నివర్తిల్లునో తెలియఁజాలకున్నారు. అట్లే శాశ్వతానందస్వరూపమును, దానిని బొందెడి సాధనమును, బడయఁజాలకున్నారు. ఈ సర్వదుఃఖ నివృత్తి, శాశ్వతానందప్రాప్తి, విషయభోగముల వలనఁ గలుగు నని తలంచి వానికొఱకు జారత్వచోరత్వాద్యనేకనికృష్టకార్యప్రవృత్తు లగుచున్నారు. వాస్తవము విచారించినచో విషయము లస్థిరము లగుటచే వానియందే సుఖమును గానరాదు. అవి సర్వదా దుఃఖదాయకములు. ఆత్మ యొక్కటియే సుఖస్వరూపము. దానిని బొందుటచేతనే యాత్మానంద మనుభవింపఁబడుచున్నది. విషయమూలమున ననుభవింపఁబడెడి సుఖము గూడ నాత్మసుఖమే. తాను గోరిన విషయము లభించి, యనుభవించు కాలమున నంతఃకరణవృత్తి యా విషయమునందొక క్షణమాత్ర మేకాగ్రమై యంతర్ముఖ మగును. ఆ వృత్తియందాత్మానందము ప్రతిఫలించి యనుభవింపఁబడుచున్నది. మూఢుఁడాత్మస్వరూపము నెఱుంగని కారణమున విషయములే సుఖస్వరూపము లని భ్రమపడి, దుఃఖమునుండి దుఃఖాంతరమును బొందుచున్నాఁడు.

ఈ ప్రపంచమునఁ గల సమస్తదుఃఖములకు మూలకారణ మాత్మాజ్ఞానము. ఆ యజ్ఞానమువలన ద్వైతప్రపంచభ్రాంతి గలుగుచున్నది. ఆ భ్రాంతి వలనఁ బదార్థములయందు సుందరత్వాసుందరత్వబుద్ధి పొడముచున్నది. దానివలన రాగద్వేషములు జనించుచున్నవి. రాగద్వేషముల వలన విహితనిషిద్ధకర్మము లాచరింపఁబడుచున్నవి. వానివలన ధర్మాధర్మము లుత్పన్నము లగుచున్నవి. ఆ ధర్మాధర్మములే శరీరోత్పత్తికిఁ గారణములు. ఈ శరీరము తా నని తలంచుట వలన సర్వదుఃఖములు సంభవించుచున్నవి. కావున నీ దుఃఖముల కన్నిటికి మూలకారణ మాత్మాజ్ఞానము. ఆ యజ్ఞానమే నిజస్వరూపసుఖము మఱుఁగుపడుటకు హేతు వయ్యెను. ఆత్మజ్ఞానము వలన నజ్ఞానము

కార్యసహితముగ నివర్తిల్లినచో మేఘపటలినుండి వెల్వడిన భాస్కరుని చందమున నాత్మ స్వయముగాఁ బ్రకాశించును. ఇట్టి యజ్ఞాననివృత్తి పూర్వక మగు నాత్మానందప్రాప్తియే మోక్షము. దీని కాత్మజ్ఞానము సాక్షాత్సాధనము; కర్మోపాసనలు పరంపరాసాధనలు.

ఈ కర్మోపాసనాజ్ఞానములను బ్రతిపాదించెడి వేదమును సృష్ట్యాదియందుఁ బరమేశ్వరుఁడు మానవులకుఁ బ్రసాదించెను. దానిని మహాతపస్సంపన్నుఁడును సర్వవిద్యాసముద్రుఁడును నగు శ్రీ వేదవ్యాసమహర్షి ఋగ్యజుస్సామాథర్వము లను నాలుగు భాగములుగా విభజించి, వాని శాఖలను – పైల వైశంపాయనాది శిష్యప్రశిష్యులచే భారతదేశమునఁ బ్రచారము చేయించెను. ఆ వేదార్థ మతిసూక్ష్మము, నత్యంతగూఢము, దుర్విజ్ఞేయము, నగుటచే మందబుద్ధుల కందుబాటులో లేకుండెను. అది గ్రహించి శ్రీ వ్యాసభగవానులు ధర్మాది చతుర్విధపురుషార్థములను బోధించే లక్ష శ్లోకములు గల మహాభారత సంహితను రచించెను. సర్వనక్షత్రమధ్యమునఁ జంద్రమండలమువలె మహాభారతసంహిత నడుమ శ్రీకృష్ణార్జునసంవాదరూపమున నద్వితీయబ్రహ్మానందామృతము వర్షించెడి యేడువందల శ్లోకములతోఁ బదునెనిమిది యధ్యాయములు గల శ్రీ భగవద్గీతోపనిషత్తు విరాజిల్లు చున్నది. వేదమునందు బలె దీనియందును గర్మోపాసనాజ్ఞానము లనెడి మూఁడు కాండములు గలవు. నిషిద్ధకామ్యకర్మములను విడిచి, కర్తృత్వాభిమానము లేనివాఁడై, ఫలాపేక్షారహితముగా, నీశ్వరార్పణబుద్ధితో నిత్యనైమిత్తికప్రాయశ్చిత్తకర్మముల నాచరించినచో నంతఃకరణమునఁగల పాపరూప మగు మలదోషము నివర్తిల్లును, గావున శ్రీకృష్ణభగవానుఁడు గీతయందలి ప్రథమషట్కమున ముముక్షుజనోపయోగ మగు నిష్కామకర్మనిష్ఠను బ్రతిపాదించి, త్వం పదార్థమును శోధించి, కూటస్థాత్మను నిరూపించెను; ఈశ్వరుని సగుణనిర్గుణోపాసనల వలనఁ జిత్తైకాగ్రత గలిగి వేదాంతశాస్త్రశ్రవణమనననిదిధ్యాసనముల కను వగును గావున ద్వితీయషట్కమున ముముక్షువుల చిత్తవిక్షేపనివృత్తి కొఱకు భగవద్భక్తినిష్ఠను బ్రతిపాదించి తత్పదార్థమును

శోధించి పరమాత్మతత్త్వమును నిరూపించెను; ప్రత్యక్పరమాత్మల యేకత్వజ్ఞానము వలనఁ గార్యసహితముగ నజ్ఞాననివృత్తి, పరమానంద ప్రాప్తిరూప మగు మోక్షము చేకూరును గావున గీతయందలి తృతీయ షట్కమున జ్ఞాననిష్ఠను బ్రతిపాదించి శోధిత తత్త్వం పదార్థముల యభేదప్రతిపాదక మగు మహావాక్యార్థమును బోధించి యఖండ బ్రహ్మతత్త్వమును నిరూపించెను.

ఈ భగవద్గీతాశాస్త్రము నందలి ప్రథమాధ్యాయ ముపోద్ఘాత రూపము. యుద్ధము చేయుటకుఁ గృతనిశ్చయులై పవిత్రకురుక్షేత్ర మున సమావేశమైన కౌరవపాండవసేనల నడుమ శ్రీకృష్ణునిచే నిలుపఁ బడిన యుత్తమరథముపైఁ గూర్చుండియున్న యర్జునుఁ డుభయసేనల యందున్న గురుబంధుజనులను జూచి, యుద్ధము చేసినచో వీ రందఱు చేనిపోవుదు రనెడి సాధారణమోహమును, వీరి నందఱను జంపినచోఁ బాపము వచ్చునసెడి యసాధారణమోహమును బొంది దుఃఖించుచు యుద్ధము చేయనొల్ల నని రణరంగమున రథముపైఁ జదికిలఁబడి యున్న యర్జునునకు శ్రీకృష్ణభగవానుఁడు రెండవ యధ్యాయమున నాత్మ చావ దనియు, దానికిఁ గర్తృత్వభోక్తృత్వములు లేవనియు మొదలగు గీతార్థ మంతయు సూత్రప్రాయముగా బోధించెను; కాని యర్జునుఁ డా యర్థమును గ్రహింపఁజాలక సంశయగ్రస్తుఁడై యుండుటచే దానినే మిగిలిన యధ్యాయములందు విపులీకరించి చెప్పెను. ముముక్షువులకు మొట్టమొదట నంతఃకరణపరిశుద్ధి గావలయును గావున నా యంతః కరణపరిశుద్ధికి సాధన మగు నిష్కామకర్మనిష్ఠను సామాన్యవిశేష రూపములతో గీతాశాస్త్రకర్త తృతీయచతుర్థాధ్యాయములందు నిరూపించెను; పరిశుద్ధాంతఃకరణములు గల యధికారులు సాధన చతుష్టయసంపత్తిని సంతరించు నిమిత్తము సర్వకర్మసన్న్యాసనిష్ఠ పంచమ షష్ఠాధ్యాయములందుఁ బ్రతిపాదించెను. ఇంతియ కాక యీ ప్రథమషట్కమున – త్వం పదార్థశోధనము గావించి ప్రత్యగాత్మ తత్త్వమును నిరూపించెను. భగవంతుని యనంతవిభూతులు, విశ్వ రూపము, భగవద్భక్తి మొదలగువానితోఁ గూడిన భక్తినిష్ఠ సప్త

మాష్టమనవమదశమైకాదశద్వాదశాధ్యాయములయందుఁ బ్రకట పఱిచెను. ఈ విధముగా ద్వితీయషట్కమున భగవద్భక్తినిష్ఠ ప్రతిపాదించుట మూలమున తత్పదార్థమును శోధించి పరమాత్మస్వరూపమును నిరూపించెను. అటుపిమ్మట — తత్త్వం పదార్థముల యభేదజ్ఞానరూప మగు తత్త్వజ్ఞాననిష్ఠను త్రయోదశాధ్యాయమునఁ బ్రకృతిపురుషవివేచనారూపమునఁ బ్రతిపాదించి శోధితతత్త్వంపదార్థముల యేకత్వరూప మగు నఖండబ్రహ్మాత్మత్త్వమును నిరూపించెను. ఈ జ్ఞాననిష్ఠకు ఫలము త్రైగుణ్యనివృత్తి. ఈ త్రైగుణ్యనివృత్తియే జీవన్ముక్తి. త్రిగుణాతీతుఁ డగు జీవన్ముక్తుని లక్షణమును జతుర్దశాధ్యాయమున బోధించెను. ఆ జీవన్ముక్తునికిఁ గలిగెడి పరవైరాగ్యనిష్ఠ సంసారవృక్షవిచ్ఛేదనరూపముగాఁ బంచదశాధ్యాయమునఁ బ్రతిపాదించెను. ఆ పరవైరాగ్యమున కుపయోగపడు దైవీసంపదాగ్రహణమును (విరోధి యగు) నాసురీసంపదాత్యాగమును షోడశాధ్యాయమునఁ దెలిపెను. ఆ దైవీసంపద కసాధారణకారణ మగు సాత్త్వికశ్రద్ధను, రాజసీతామసీశ్రద్ధల నివృత్తిపూర్వకముగా సప్తదశాధ్యాయమున నిరూపించెను. ఇట్లు పదుమూఁడవ యధ్యాయము మొదలు పదునేడవ యధ్యాయము వఱకుఁ గల యయిదధ్యాయములయందు ఫలసహితముగా జ్ఞాననిష్ఠను బ్రతిపాదించెను. అష్టాదశాధ్యాయమున నీ గీతాశాస్త్రముయొక్క సర్వార్థము నుపసంహరించెను. ఈ విధముగా గీతార్థమున కంతటికిఁ బరస్పరసంబంధము గలదు.

ఈ గీతాశాస్త్రము సర్వోపనిషత్సారభూత మగుటచేతను, నరనారాయణాంశసంభూతు లగు శ్రీకృష్ణార్జునసంవాదరూప మగుటచేతను, శ్రీవేదవ్యాసమహర్షిప్రోక్త మగుటచేతను, నిది యుత్తమోత్తమగ్రంథరాజమై విరాజిల్లుటయే కాక, ప్రస్థానత్రయములో నొకటిగాఁ బరిగణింపఁ బడినది. దీనికి శ్రీశంకరరామానుజమధ్వాది మతాచార్యు లనేకులు వారి వారి మతానుసారము సంస్కృతమున భాష్యము లొనర్చిరి. దేశదేశాంతరముల యందున్న వివిధభాషలలో దీని కనువాదములు, వ్యాఖ్యానములు విరివిగా వెలసినవి.

కాని యింతవఱకీ శాస్త్రగ్రంథమును గావ్యరూపముగా సంతరించిన వా రెచ్చోటను గన్పట్టరైరి. ఇప్పుడు శ్రీ జయపురాస్థానాధీశ్వరులగు శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజుగారి గౌరవాస్థానకవులును, మహావిద్వాంసులును, ఆంధ్రకాళిదాస కళాప్రపూర్ణేత్యాదిగౌరవ బిరుదాంకితులును నగు శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుగారీ గీతాశాస్త్రమును భగవద్గీతామృత మను పేరితో గేయనాటికా కావ్యముగా నొనరించుట యపూర్వవిషయము.

వీ రీ వఱకు రఘువంశము, కుమారసంభవము, ఉత్తరరామచరితము, కిరాతార్జునీయము, మొదలగు సంస్కృతగ్రంథములకుఁ దెలుఁగునఁ బద్యరూపానువాదములు చేసి విద్వల్లోకమునఁ బ్రఖ్యాతి వహించిరి. కాళిదాసుని మేఘసందేశమునకు మెఱుఁగులు దిద్ది మొయిలు రాయబార మను పేరితోఁ దెలుఁగున దేశీయగేయకావ్యముగా రచించి 'యనిర్వచనీయ మైన భావుకత'ను అపూర్వప్రతిభను బ్రకటించి కళాప్రపూర్ణు లైనారు. వారి మొయిలుఁగన్నియ యందచందములు చూచి మహాపండితులే విస్మయంపడిరి. ఆంధ్రలోకమునం దింతటి యుదాత్తభావుకుఁడు, ఇట్టి యుపజ్ఞాశాలి, సరసమహాకవి యింతవఱకుఁ బుట్టలేదు, మఱి పుట్టఁబోఁ డనిపించినది. *

ఈయన పలుకావ్యములను భాషాంతరీకరించుటతోఁ దృప్తి నొందక, శాస్త్రమును, అందును నుత్తమోత్తమ మగు యోగశాస్త్ర మైన భగవద్గీతను గావ్యరూపముగా వెలయించుటకుఁ బూనుకొని యద్భుతావహముగఁ గృతకృత్యు లైరి.

ఈవఱ కెందఱో కవులు, పండితులు గీతాశాస్త్రమునకు భాష్యములు, వ్యాఖ్యానములు, టీకలు వ్రాసిరే కాని కావ్యరూపమున వెలయించిన వారు కన్పట్టరు. కొందఱు భగవద్గీతకుఁ జేసిన బద్యరూపాంధ్రీకరణములు చూచియుంటిమి. వానిలోఁ గొన్ని ధారాళముగను, బ్రసన్నముగను నున్నవి గాని, రసోదంచితములుగా లేవు. ఈ కవి

---

* జిజ్ఞాసువులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారి యుపోద్ఘాతరూప మైన 'మొయిలు మెఱుఁగులు' అను వ్యాసము చదువుకొందురు గాక.

శాస్త్రార్థమును లెస్సగా జీర్ణము చేసికొనుటయే కాక తమదిగాఁ జేసి కొని కావ్యరూపమున వెలార్చినారు. వీరు గీతయందలి ప్రతిప్రకరణము నందుఁ బ్రతిపాదింపఁబడిన విషయము ననుసరించి యా యర్థమును దెలియఁ జేసెడి మకుటమును బ్రతిగేయమునకుఁ దత్తదుచితఘట్టముల యందిడినారు. ఆ మకుటము చేదువ్రుటతోడనే యా ప్రకరణము సువ్యక్త మగుచున్నది. దాదాపు కృతి నంతటిని దేశీయచ్ఛందమున వెలార్చుటయే కాక యీ కవి కావ్యమునందలి విషయభేదము నెఱిఁగి తదనురూపచ్ఛందోరీతులను బ్రయోగించి యున్నారు. మాత్రాచ్ఛంద మును వాడి యా యా ఘట్టముల నుచితరీతిని మితి నెఱిఁగి పరిమితము చేసియున్నారు.

కృత్యాదిని గీతాకన్య విక్రమదేవుని యాస్థాని కేగి ముచ్చ టించిన ముదిపెపు మాటలు ముద్దుల మూటలు; ఆ యాస్థానమునుండి వీడుకోలు పుచ్చుకొని వెడలుచుఁ బాడిన గేయము ప్రత్యక్షరసార్థకమై గీతారచనోద్దేశముఁ బ్రకటించుచు నత్యంతరమణీయముగా నున్నది. గ్రంథస్థవిషయమును గూర్చి వేఱుగా వివరింపఁ బనిలేదు. కవి సర్వోపని షత్తుల సారమును దీసి వడకట్టి భగవద్గీతాశాస్త్రరూపమునకే మెఱుఁ గులు సంతరించినారు. గీతాశాస్త్రమును రసాయనపాక మొనర్చి యమృతమును జిమ్మి శాస్త్రమునకుఁ గావ్యత్వము చేకూర్చినారు. భగవద్గీతామృతము కావ్యముగాఁ దెలుఁగునాట నత్యంతప్రశస్తి పొందఁ గల దనుట నిర్వివాదాంశము. భగవద్గీతకు శాస్త్రలోకమునఁ గల స్థానమే యీ కృతికి నాంధ్రకావ్యప్రపంచమునఁ గల దనుటలో నత్యుక్తి యుండఁబోదు.

ఈ యమృతమును గ్రోలినవారు జననమరణరూప మగు సంసారసముద్రమును దరింతురు గాక.

హేలాపురసంస్థానము
సంక్రాంతి, 1954.

శ్రీమత్పరమహంస,పరివ్రాజకాచార్యవర్య,
జగద్గురు
**శ్రీ బ్రహ్మానందగిరి స్వామిజీ**

# పరిచయము

మన కవి చిన్ననాఁట నుండి సంప్రదాయరీతులలోఁ బెరిఁగినవాఁడౌటచే భగవద్గీతాయోగవాసిష్ఠాది తత్త్వగ్రంథముల పట్ల మక్కువ గలవాఁడై యనుదినము జపమాచరించు నైష్ఠికుఁ డయ్యెను. వయస్సు మరలిన కొలఁది నీ భావమే కవిలో జీర్ణించి కావ్యానువాదరచనము నిలిపి తత్త్వగ్రంథములకుఁ గావ్యానువాదములు చేయుటకుఁ బురికొల్పినది. దాని ఫలితమే ప్రకృతకావ్యము. పిమ్మట యోగవాసిష్ఠమును బద్యాంధ్రీకరణముగఁ బ్రారంభించి కవి 1948 వ సం॥ లోఁ గాలధర్మ మొందుటచే నీకృతికి నంతరాయము గల్గుటయే కాక— అపూర్వఫణితిని, గద్యపద్యాత్మకముగా రసాత్మకమగునట్లు త్రిపురాన వంశమును గూర్చి చరిత్రరూపముగా వ్రాయఁబూనిన సంకల్పము కూడ నెఱవేఱదయ్యెను.

భగవద్గీతాతత్త్వగ్రంథానువాదములో మన కవి ప్రదర్శించిన ప్రతిభావ్యుత్పత్తులను గూర్చి "తొలిపలుకుల" యనంతరము విశేషించి యుగ్గడింపఁ బనిలేదు. ఈ కావ్యనిర్మాణమును గూర్చి యొండురెండు మాట లప్రస్తుతములు గావు. కృతికర్త

"తగదు తగ దిది పార్థ" (పుట ౧౮)

యను మకుటము గల భాగములతోఁ (8-4-1941 వ తేదిని) బ్రారంభించి, కావ్యారంభమును (౧౧ పుట మొదలు) 2-1-1942 వ తేదిని బూరించిరి. పంచమాధ్యాయము వఱకుఁ గల కావ్యభాగమును 27-1-1942 నాఁటికిఁ బూర్తిచేసిరి. 1942 ఫిబ్రవరి, మార్చినెలలలో రచనకు అవాంతరము గల్గెను. 2-4-1942 వ తేదినుండి పునారచన మారంభించి యచంచలదీక్షతో మాసాంతమునకుఁ గావ్యమును సమాప్త మొనరించిరి.

కవిగారు తమ వ్రాఁతప్రతిలో నే యే భాగముల నే యే వేళల వ్రాసి పూర్తిచేసికొనుచు వచ్చిరో వివరముగ నుటంకించియున్నారు. ఆయా వేళలనుబట్టి యించుమించు కావ్యనిర్మాణ మంతయు రాత్రి వేళల 12—4 గంటల నడిమికాలమున జరిగినట్లు తెల్ల మగును.

ఈ కవి రచనావిధానములలో నొక ప్రత్యేకవిశిష్టతకలదు. తాము పగ లంతయు నితరవ్యాసంగములలో నిమగ్నులై ప్రశాంతముగ రాత్రివేళలఁ దమ సౌధోపరిభాగమున శయనించుచు, లేచి విహరించుచుఁ, దాము సంకల్పించిన కృతిని మనోగతముగానే నిర్మించి రూపొందించి యేదో యొక వేళకు నిద్రించెడువారు. ఉదయము లేచి రాత్రి యల్లిన తమ మనోమాత్రస్థితకావ్యభాగములను గాగితములపై కెక్కించెడివారు. ఇట్టి రచనావిధానమున వీరికిని ఆంగ్ల కవిశిఖామణి మిల్టనునకు సామ్యము కలదు. *

కాని యీ కృతిని బైవిధముగా మనోగతిని రూపొందించియు వెనువెంటనే రాత్రివేళలయందే కాగితములపై వ్రాసిపెట్టుచు వచ్చిరి - ఉదాహరణమునకు—

(i) "మానిత విజ్ఞానముతో" (౫౫ వ పుట) అను మకుటము గల యేడవయధ్యాయమును 2-4-1942 వ తేది రాత్రి 12 గంటలకును,

(ii) "విజ్ఞానాన్విత మతిగోప్యంబీ..." (౬౫ వ పుట) అను మకుటము గల తొమ్మిదవ యధ్యాయము 4-4-1942 వ తేది రాత్రి 2 గంటలకును

బూరించిరి. ఇట్లే దాదాపు కావ్య మంతయు రచింపఁబడిన దని వ్రాఁతప్రతివలనఁ దెలియుచున్నది.

ఈ కృతినే కాక మన కళాప్రపూర్ణుని యితరాముద్రితములను గూడఁ బ్రచురించుటలో వెనుబాటులేని దీక్షను జూపుచున్న సాధ్వీమణి, కవితల్లజుల యర్ధాంగి రామరత్నమ్మగారికి ఆంధ్రపాఠకలోకము కృతజ్ఞతాబద్ధమై యున్నది.

గుంటూరు
1-1-1954

ఎలవర్తి రోశయ్య, ఎం. ఏ.,
అవుల గోపాలకృష్ణమూర్తి

---

* మిల్టన్ తా నంధుఁ డగుటచే నేకాంతమునఁ గావ్యములను మనోవీథిని వినిర్మించుకొని తన కూఁతును మేల్కొలిపి యామెచే వ్రాయించెడి వాఁ డనుట ప్రఖ్యాతమే కదా !

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః
శ్రీ గురుభ్యో నమః

శ్రీ

# గీతాకన్యకావిర్భావము

— శ్రీ జయపురము కోటలోఁ గ్రొన్నెలతాల కొలువుఁగూటమునఁ జిత్రభాను సంవత్సరాశ్వయుజశుద్ధనవమీ భానువాసరము దివ్యాసనాసీనుఁడైయున్న శ్రీ శ్రీవిక్రమదేవవర్మమహారాజర్షి శేఖరుని యెదుట గీతాకన్య సాక్షాత్కరించెను —

గీతాకన్యక -(ప్రాంజలియై) జయ జయ సాహితీ సామ్రాజ్యసార్వభౌమా! కళాప్రపూర్ణా! జయపురాధీశ్వరా! శ్రీ విక్రమదేవవర్మ మహారాజర్షి శేఖరా!

( కాంభోజి - మిశ్రచాపుతాళము )

మొయిలుఁగన్నియమిన్న
ముద్దుఁజెల్లెలి నన్ను
దయఁ జూడుమా! యనుఁగుఁ
దండ్రి! విక్రమభూప!

ప్రయతులగు త్రిపురాన రాట్కులశ్రీభవుల కూరిమి యాఁడుబిడ్డను
గయిత తేనియ లొలుకు నమృతపు శ్రీ గానలహరుల నవతరించితి
నియతిమై మా రామకృష్ణుని శ్రీ నిఖిలసుగుణాలంకరిష్ణుని
భయదభవబంధనహరిష్ణుని శ్రీ భక్తలోకశుభంకరిష్ణుని

స్వయముగాఁ జేకొని వరించిన ఽ పసుపుబొత్తుల పెండ్లికూఁతుర
జయపురీశ్వర! నీకు నర్మిలిఁ ఽ జాఁగిలుచే మ్రొక్కెడఁగ వచ్చితిఁ
బ్రియజనక! దీవించి నాకును ఽ బెరిమ మెచ్చేల యరణపున్ స
త్రియల నీవే నేను భగవఽద్గీతికాకన్యకను జూవే.

ఘొయిలుఁగన్నియ......

తల్లి దండ్రియు లేక యిల్లు వాఁకిలి లేక
యల్లాడు నల్లవాఁ డల్లుఁ డయ్యెను నీకు ;
ఎల్లప్పుడును నీదు హృదయపద్మమునందు
నిల్లఱిక ముండు నా హృదయాధినాథుండు ;

అల్లునకు నిల్లఱిక మిచ్చుటఽ యధిప! నీ కాచారమే కద
యల్ల పాల్కడలికిని నా విభుఁడిల్లటపు టల్లుండ యాఁ గద
యెల్ల జగముల కిల్లు వాఁకిలిఽ తల్లి దండ్రియు నగు మదీశుఁడు
కల్లకపటము లెఱుఁగఁ డాశ్రితఽవల్లభుఁడు భక్తాభిగమ్యుఁడు
ఫుల్లసరసీజాక్షుఁ డీ నీఽ యల్లునకుఁ గూఁతునకు నీ దగు
నుల్లమునఁ దా విడి తదాత్మతఽ నుల్లసిలం గదవె దేవా!

మొయిలుఁగన్నియ......

ప్రాఁతచేదువుల తుదలఁ బరఁగు తత్త్వమ్ము వి
ద్యోతమానము సేయు నుపనిషత్సతి నేను
మాతృగర్భోద్భూతి మాన్చి జీవుల కెల్ల
బ్రాఁతియా పద మిచ్చు బ్రహ్మవిద్యను నేను
భూతేశ్వరుని హరిని బొందఁ గడఁగెడు వారి
కూఁతయై దరిఁ జేర్చు యోగశాస్త్రము నేను
ప్రీతి సత్యము దెల్పి ప్రియవోలె భవరోగ
కాతరత్వముఁ బాపు కావ్యకన్యక నేను

జాతిమతలింగప్రభేదమున్ నా తలంపున లేదు మానవ
జాతి కంతకుఁ జెందినది నాన్ సమపదేశవిశేషతత్త్వము
ఆతతామరభాష దెలియఁగన్ సలవిగాక యనేకభాష్యపు
రీతులన్ మతభేదములఁ బచేన్రించు చేప్పని తెలుఁగు సేఁతల
♦చేత మఱుఁగైయున్న భగవన్ద్గీతికా పరమార్థ మాంధ్రుల
చేతములకుం దేటతెల్లమున్ సేయఁ గవితాగానరససం
భూతికలనాపారవశ్యసన్ముద్గతాభిరుచుల్ వెలార్చెడు
నూతనచ్ఛందోవిశేషమన్నోహరములగు దేసి పాటలఁ
బూతతమ్మ్రాయరాట్కవిప్రభున్పుత్త్రకవితాభారతిని న
న్నీ తెఱంగున నాటికగ వెలన్యించె మా శ్రీరామకృష్ణుఁడు
భూతలాధిప ! నాకు నీ యిలున్ పుట్టిని ల్లగుఁ గాన నా యీ
తాతపాదుల దీవన ల్గొనఁన్ దత్పరత వచ్చితిని జోవే
మొయిలుఁగన్నియ.....

మూటిఁ దెల్లము సేయు ముయ్యాఱు యోగాలఁ
బాటిల్లు పరతత్త్వభావమ్ము లెఱిఁగింతు
బాట దప్పినయట్టి పలుమతంబులలోని
లోటుపాటులఁ దీర్చు లోగుట్టు వెలిబుత్తు
గాటమౌ నా యనెడు కటికిచీఁకటి తెఱల
వీటిఁ బుచ్చెడు తెల్వివెలుఁగుదివియ నిత్తుఁ
బోటు పాటుగఁ బొంగు పుట్టు సావుం గడలి
దాఁటించి తెలిదీవి దరిఁజేర్చు తరి నౌదు

నూటయెనిమిది యుపనిషత్తులన్ దీటుకొను పరమార్థ మంతయు
మాటిమాటికిఁ దెలుఁగు మనసులన్ నాటుకొని మైమఱపు గొలుపఁగఁ
దూఁటువడు నెలవలన జేలజేలన్ *దొరఁగు నమృతము లీలఁ బలుకుం

---

♦ మూఁత ముప్పిడిగొన్న   * మాటికిని సుధ యొలుకుగతి.

బోటి యిరుచేనుబాల క్రొంజేవుఽ లూట లూర్పఁగఁ దెలుఁగునాటన్
నేఁటి మిసిమి తెలుంగుఁ గబ్బపుఽజోటు లందును విందుగొల్పెడు
మాటనేర్పరి వాటపాటలఽమేటి వన్నిట నీకు నీవే
సాటి యని మనసారఁగా నీఽబోఁటి పెద్దలు మెచ్చ జగ మను
బూటకపుఁ బెనుమాయ తెరలోఽ మాటువడు నా విభుని సత్యముఁ
దేటపఱిచెడు నందచందపుఁఽదీరుతియ్యము లొలుకు కమ్మని
పాటలం బాడంగ నేర్తునుఽ నాటకా లాడంగ నేర్తును
నాఁటికిని నీ నాఁటికిని నేఽనాఁటికిని నీ పేరితో· ము
మ్మాటికిని నేఁ దెలుఁగువారలఽ నోట నాడుచునుందుఁ జూవే.

మొయిలుఁగన్నియ......

కర్మషట్కములోని మర్మమ్ము దెలిసిన
నిర్మమ త్యాగివౌ కర్మయోగివి నీవు
భక్తిషట్కములోని పరమార్థ మెఱిఁగిన
భక్తాగ్రణివి పరమభాగవతుఁడవు నీవు
జ్ఞానషట్కములోని మానితార్థముఁ గన్న
జ్ఞానసంపన్న రాజర్షి మౌళివి నీవు
బ్రహ్మాత్మకంబౌ ప్రపంచంబు సర్వమున్
బ్రహ్మభావముఁ గన్న బ్రహ్మజ్ఞుఁడవు నీవు

ఎన్ని తెన్నులు గలవొ యన్నియుఽ నెఱిఁగి యెఱుఁగని యట్టు లుందువు
అన్ని కర్మము లాచరించుచుఽ నంటి యంటక మెలఁగుచుందువు
తన్నుఁ దనలో నరసికొను లోఁఽగన్ను గలిగిన యాత్మవిదుఁడవు
నన్ను గుఱిగా నెన్ని బ్రహ్మాఽనందరసపరవశుఁడ వగుదువు
నిన్ను నెఱుఁగుదు నేను నీవుఽ నన్ను నెఱుఁగుదు నీకు నాకును
బన్నుపడి యేర్పడిన యవినాఽభావబంధము దెగదు తండ్రీ !

మున్ను తాతల నాఁటినుండియున్ మొనయు చెలిమికిఁ బాత్ర మగు నా
కన్నతండ్రిని నీ సుతునిగాన్ గౌరవాస్థానైకకవిగాఁ
గొన్నవాఁడవు గాన నీకునున్ నన్ను నే నర్పించుకొంటిని
మన్ననం గైకొమ్ము మొయిలుంగన్నియం బలె నన్నుఁ జోడుము
చిన్నికృష్ణుఁడు నీకు సతతమున్ చిరతరాయు వొసంగి ప్రోచుఁ జు
మన్న! సన్నుతకీర్తిసాంద్రా! యాధునిక జనకావనీంద్రా!
మొయిలుఁగన్నియ.....

భాగవతరాజకవిశేఖరా! నీకును నాకును సర్వజగంబులకును నేలికయైన మా శ్రీరామకృష్ణపరబ్రహ్మానందమూర్తి నిజపదాబ్జభక్తుండవైన నీ యెడ సుప్రసన్నుండై నీ కడకు నన్నుం బుత్తెంచుటం జేసి నీ యెదుట నిట్లు సాక్షాత్కరించి మదాగమనప్రయోజనం బెఱింగించితి. భగవదనుగ్రహప్రాప్తంబై యయాచితోపపన్నంబైన నా యపూర్వపరిగ్రహంబున నీవు ధన్యతముఁడ వైతివి. నీ యశంబు భవాదృశరాజకంబునకు నాదర్శకంబై చిరస్థాయియై యొప్పారఁ గలదు

మహారాజోత్తమా! అద్యతనదేశకాలపరిస్థితులంబట్టి దేవరకు విన్నవింపవలసిన విశేషం బిం కొకటి గలదు. నీ సన్నిధానవర్తులు కర్తవ్యోపదేశం బొనరించు పట్టునం బ్రభుచిత్తం బెట్లగునో యని సంకోచించుచుందురు. సౌజన్యవిధేయులై సర్వస్వతంత్రులై నిరంకుశులైన శ్రీ భాగవతరాజకవీంద్రుల కవితాభారతీసంతతికిం జెందిన నా వంటి కృతిపుత్రికకు నట్టి సంకోచ మొందం బనిలే దనియు విశేషించి నిజపుత్రిక నగు నా పలుకులు ముద్దుసేసి గుణంబు గ్రహియింపఁ గల గుణగ్రహణపారీణతయు రసజ్ఞతయు దేవరకుం గలవనియు భావించి విన్నవించుకొనుచున్నదాన.

దేవా !

పడమటి రాజ్యముల్ కలన బగ్గున మండుచు నున్న వెంతయున్
దొడిబడి వాని మంట లిటఁ దూర్పునఁ బ్రాఁకి ప్రపంచయుద్ధ మే
ర్పడినది ♦ రాజసంతతులు రాజ్యము లింకిట నెట్లు తారుమా
ర్పడునొ యెఱుంగరాదు భగవంతుని లీల యగమ్యగోచరం
బడుగని రాజ్యకాంక్షయె మహాగ్రరణంబుల కెల్ల మూల మె
ప్పుడు మహి ధర్మవిప్లవము పుట్టును యప్పుడ పుట్టి దుష్టులం
బొడ వడఁగించి శిష్టులను బ్రోచెద నంచు వచించెఁ గృష్ణుఁ డి
య్యెడ నల విశ్వరూప ధరుఁ డెవ్వఁడుగా నవతార మందునో.

*　*　*　*

జడధిపరీతమౌ ధరణిచక్రమునం జగదేకవీరులౌ
కొడుకులఁ గన్న తల్లి యని గొప్ప యశమ్మును గొన్నదయ్యుఁ బే
రడుసునఁ జిక్కుకొన్న సురహస్తిని పోలిక నస్వతంత్రతన్
బడు గగు భారతాంబికకు భావిదశాగతు లెట్టు లుండునో.

*　*　*　*

తడఁబడి మోహముం గొనక ధర్మువు దప్పక యాత్మధర్మమున్
విడువక సర్వకర్మములు విష్ణుసమర్పణబుద్ధిఁ జేయుచున్
నుడివడకా హరిన్ శరణు సొచ్చి తదర్పితచిత్తవృత్తిమై
నడచుకొనంగ నేర్చుటయె నాదగు గీతలలోని సార మీ
వడువునఁ గర్మయోగి యగు వాఁడు పరేశు కృపాకటాక్షముం
బడసి దురంతసంసరణబాధలకుం గుఱిగాక యెట్టి పే
రిడుమలు గల్గినన్ వెఱవ కెందును నంటియు నంట కార్తి బి
ట్టడలక నిత్యతుష్టుఁడయి యవ్యయదివ్యపదంబు నొందెడున్.

---

♦ ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున వ్రాయఁబడినది.

బుడమిని రాజ్యసంపదలు బుద్బుదముల్ వలె నస్థిరంబులై
యడఁగును గీర్తిధర్మసముపార్జన కయ్యెడు రాజ్యమే కడుం
గడుఁ బరిపూజ్య మింత యెఱుఁగం గల భూపతి దీప ముండఁగాఁ
దడవుకొనన్ వలెన్ సకలధర్మవిదుండవు నీ వెఱుంగవే ?

కడుకొని దీనులం గరుణఁ గావుము కావ్యకళాకలాపులై
యడరెడు సత్కవీశ్వరుల నర్మిలిఁ బ్రోవుము తొంటి కంటె నె
క్కుడుగ సుకీర్తిధర్మములఁ గూరిచి కొంచె రమేశుఁ గొల్వఁగాఁ
గడఁగుము మావిభుండు నినుఁ గావుత విక్రమదేవభూవరా !

తండ్రీ ! నా ప్రాణేశ్వరుం డైన శ్రీరామకృష్ణపరబ్రహ్మానంద మూర్తి నా రాకకై యెదురుసూచుచుండు నింక నేఁ బోయివచ్చెద.

(కేదారగౌళ — ఏకతాళము)

ఆడుకొందు నే నాడుకొందు నీ
యతులితకీర్తిసతీమణితోడం
గూడి మహాంధ్రోత్కలభూములలో
గొనబుంగోయిల తేటపాటలను
బాడుకొందు నేఁ బాడుకొందు శ్రీ
భగవద్గీతాతత్త్వార్థంబుల
వేడుక నాకు ననుజ్ఞ నొసంగవె
విక్రమదేవ ! మహోన్నతభావా !
ఆడుకొందు......

అచ్చపు గుమ్మడిపండులఁ బోలెడు
నక్షయపాత్రలఁ దలపై నిడికొని
యిచ్చం బల్లెలఁ బట్టనములలో
నింటింటను శ్రీహరికీర్తనముల

నుచ్చైస్స్వరమునఁ బాడుచుఁ గంజెర
లూని లయానుగతిన్ వాయించుచు
బిచ్చె మెత్తు వైష్ణవులచేత సం
ప్రీతిని నా పాటలఁ బాడించుచు,
ఆడుకొందు......

హేలాగతిమెయి సంస్కృతాంధ్రసా
హిత్యగానకవితాకళలందున్
జాల పరిశ్రమ మొనరిచి విద్వ
జ్జనులు మెచ్చ శ్రీహరికథైకస
త్కాలక్షేపము లాచరించుచును
గణ్యత కెక్కిన హరిదాసులచే
నోలి హరికథారూపిణినై త
త్త్వోపన్యాసమ్ములఁ జెప్పించుచుఁ
బూలమాలికలఁ బోలెడు పాటలఁ
బోఁడిమిఁ బాడించుచు నాడించుచు
ఆడుకొందు......

ఇరుగుం బొరుగుల యమ్మలక్కలును
నిలు దీఱిచి తమ తీఱికవేళల
సరిగా నొకచోఁ గొలువు దీర్చికొని
సమ్మోదమున సత్కాలక్షేపము
జేరపికొనెదు తఱిఁ జేకొఁగఁ బాడం
జేదువ న్నేర్చిన కలకంఠులచేఁ
బరవశతం గొన నాదగు పాటలఁ
బాడించుచుఁ నాదల లాడించుచు
ఆడుకొందు......

వీణావాదనకలనాచణు లగు
వైణికవర్యులు వీనులవిందగు
వేణుగానముల వెలి విరియించెడు
వేణుధారులును గాత్రపుఁబాటన్
గాణ లగుచుఁ బ్రఖ్యాతిం గాంచిన
గాయకులుం గల గానసభలలో
వీణావేణుసుగాత్రస్వరముల
వేడుక నాపాటలఁ బాడించుచుఁ
ఆడుకొందు......

ఆంధ్రవిశ్వవిద్యాలయంబునకు
నత్తుకొను కళాశాలలఁ జేదివెడు
నాంధ్రబాలురకు గీతాశాస్త్రము
నందలి తత్త్వమ్మును బోధించుచు
నాంధ్రాభ్యుదయంబునకై యెంతయు
నలజేడఁ బడియెడు దేశభక్తులగు
నాంధ్రులకును నిష్కామకర్మవిధు
లల్లవడ నిజధర్మము లెఱిఁగించుచు
నాంధ్రులకే కాకాంధ్రము నేర్చిన
యన్ని మతంబుల యాంధ్రేతరులా
నాంధ్ర దేశవాసులకును మనముల
నాకర్షించెడు పాటలఁ బాడుచు
ఆడుకొందు......

రంగస్థలమున రక్తి గట్టఁ గల
రమ్యపుఁ బట్టుల నేఱిచి తీఱిచి

సంగీతోపకరణసామగ్రిని
జేక్కు(గ( గూరిచి భావోచితమా
నంగాభినయం బొనరుచు శ్రీకృ
ష్ణార్జునపాత్రల సమకూరిచి స
ర్వాంగీకృతముగ గీతానాటిక
నాంధ్రరంగములయం దాడించుచు
ఆడుకొందు......

మహారాజా! సెలవు.

(శ్రీవిక్రమదేవవర్మమహారాజర్షి శేఖరుని హృదయపద్మ పీఠికయం దాసీనుఁడైయున్న శ్రీరామకృష్ణపరబ్రహ్మ నందమూర్తి యంకము నధిరోహించెను.)

ఇది గీతాకన్యకావిర్భావము

# భగవద్గీతామృతము

(తెరలో)

'ప్రాంశుఁ బయోదనీలతను భాసితు నుజ్జ్వలదండధారుఁ బిం
గాంశుజటాచ్ఛటాభరణు నాగమపుంజపదార్థతత్త్వని
స్సంశయకారుఁ గృష్ణమృగచర్మకృతాంబరకృత్యు భారతీ
వంశవివర్ధనుం ద్రిదశవందితు సాత్యవతేయుఁ గొల్చెదన్.'

స్థలము
ధర్మక్షేత్రమగు కురుక్షేత్రము
సంజయుని ప్రవేశము

**సంజయుఁడు:**— (సభక్తికముగాఁ జేతులు మోడించి, కన్నులరమోడ్చి ధ్యానము నటించుచే 'ప్రాంశుఁ బయోదనీల...' అను పద్యము మరలఁ జదువును.)

అహాహా! ఆ కృష్ణద్వైపాయనమహర్షిశేఖరుని దివ్యప్రభావ మప్రమేయము గదా! దాననే హస్తినాపురినుండి యీ కురుక్షేత్రము నరనిముసములోఁ జేరుకొంటిని.

(యుద్ధభూమిఁ గలయఁజూచి) ఏమి యీ కురుపాండవయోధుల సమరోత్సాహము! 'కాలం బగుటయు నృపులకు నాలము సమకూరె దీని కడలకు' మని ధృతరాష్ట్రు నూఱడించిన యా సాత్యవతేయుని పలుకు సత్యము గదా!

ఆనాఁ డమ్మహర్షి ధృతరాష్ట్రుని కడకు విజయంచేసి 'పుత్రా! ఆలం బాలోకింప వలతేని దివ్యదృష్టి నిచ్చెద' నని పల్క నమ్మహారాజు 'ఘోరంబగు నయ్యన్నదమ్ముల పోరు వినవలతుంగాని కనఁ జాల' ననిన నట్లు కాని మ్మని సన్నిధినున్న నన్నుం జూచి 'సంజయా!

నీవు సమరవార్తలు సర్వంబు నీ జేనికి వినిపింపు' మని నియోగించి నాకు - రెండుదెఱంగుల వారి దివారాత్ర ప్రవర్తనంబులు గనునట్లును రహస్యప్రకారభాషణంబులు వినునట్లును మనోవృత్తంబు లెఱుంగు నట్లునుం గా వరం బిచ్చి యతిశీఘ్రగమనంబు నొసంగి భారతసమరధరణిం దిరిగినను శస్త్రాస్త్రంబు లెవ్వియుం దాఁక కుండునట్టి ప్రభావంబుఁ బ్రసాదించి దివ్యుల యాలాపంబులు రూపంబులుం దలంపులుం దేటపడునట్టి మహనీయబోధంబునుం గలుగ ననుగ్రహించె.

ఆ తపోధనసత్తముని పనుపున నేఁటి ప్రథమదివససమర ప్రకారం బరయ నిందులకు వచ్చితిని.

అదిగో! దుర్యోధనుండు ధనురాచార్యుని సమీపించి యిరు వాఁగునందలి యోధవీరుల బలాబలంబుల తెఱం గెఱింగించుచు మీ రందఱుం గనుగలిగి సేనానాథుఁడైన భీష్ముని రక్షింపవలయు నని చెప్పుచున్నాఁడు.

(ఉల్లాసముతో, వినుట నభినయించి) అహాహా! సమస్తవీరవరశంఖ నినాదములఁ గ్రిందుపఱుచుచు నదే పాంచజన్యధ్వనితోఁ గూడి గాండీవగుణనిక్వణమ్ములఁ గలపికొని దేవదత్తారావము వీనుల విందుగా వినవచ్చుచున్నది.

(మరలఁ దెరలో)

'కృష్ణా!

కౌరవులలోన నిప్డు డీకొన్వారితోడ
ననికిఁ గడఁగుదునో చూచికొనఁగ వలయు
నరద మల్లన యుభయసైన్యముల నడిమి
నేల కటు పోవఁగా నిచ్చి నిలుపు మచట.'

(ముందటికిఁ జూచి కృతాంజలియై)

ఆహా ! కన్నుల కఱవు దీఱినదే ; ఏమి నా భాగ్యము !

సీ. ఘనదీప్తిమండలింగ నుదోయి మిఱుమిట్లు
గ్రమ్మించు కపికేతనమ్ముతోడ
మిన్నేటి క్రొన్నుర్వుగ మించు మైచాయలం
గొమరారు ధవళరథ్యములతోడ
పాంచజన్యరవానుబంధబంధుర దేవ
దత్తశశ్వన్నినాదములతోడ
శస్త్రజాలప్రభాశబలదివ్యకిరీట
బహుమణిద్యుతిపరంపరలతోడ

తే. గీ. కృష్ణసారథికంబైన జిష్ణురథము
ప్రబలపాండవసైన్యగర్భమునుండి
వెడలి కడుమ్రోఁగు నిరువాఁగునడిమి యెడకు
నల్ల నల్లన యల్లదే యరుగుదెంచె.

పురాణపురుషులైన యన్నరనారాయణుల దఱియం బోయి వారి చెందం బవలోకించెదఁ గాక !

(నిష్క్రమించెను)

(తరువాత రథారూఢులై కృష్ణార్జునులు ప్రవేశింతురు)

అర్జునుఁడు:- (కౌరవసేనం గలయఁ బరికించి చూచి సదయుఁడై విషాదసంభ్రమములతో) కృష్ణా !

సడలెడు నంగము లెండెడుఁ బెదవులు
వడఁకును గగ్గురు నెమ్మొయిఁ బొడమెడు

జడమగు చేయి విడి గాండివ మిదె దిగ
జారెడు నొడలును బగబగ మండెడు
నెడఁదయుఁ దిరుగుడు వడియెడు నిలుచేట
కేనియు వసమటె పోయితి నెన్నో
చెడుగు నిమిత్తము లొదవెడుఁ గేశవ!
శ్రేయము గా దిది మన కకటా!

విజయ మే నొల్ల గోవింద! యీ రాజ్య
వివిధభోగసుఖైకవిభవ మే నొల్ల
స్వజనసంతతిఁ జంపి సమకూర్చుకొన్న
జగతిరాజ్యం బేల? సౌఖ్యంబు లేల?
యజవంద్య! యెవ్వారికై రాజ్యసుఖము
లాత్మఁ గోరుదు మొ వా రందఱుం దెగువ
నిజధనప్రాణాల నెఱయాస లుడిగి
నేఁ డిదే పోరికై నిలిచి యున్నారు.

సుతులు తాతలు గురువులుఁ బితలు మేన
మామలును బావమఱఁదులుఁ మనుమ లాది
గాఁ గలుగు బంధుగులె యిందుఁ గానఁబడెద
రకట! వీరలఁ జంపఁ జేయాడ దనఘ!

వీరలెల్లఁ గూడిఁ బోర నన్ జంపినం
జంపనిమ్ము వీరిఁ జంపఁ జాల
దీన నొదవు త్రిజగతీరాజ్య మే నొల్ల
నవనిరాజ్య మెంత? యంబుజాక్ష!

అకట! ధార్తరాష్ట్రహతిఁ బాపమే కాక
కృష్ణ! మనకు నేమిఁ బ్రీతి గలుగు?

స్వజనహాననమునను గ సమకూడునే సౌఖ్య ?
మింత పాపకృత్యగ మేల మనకు ?

భూరిలోభవినష్టబుద్ధులై నేఁడు
పోరికిం దెగువమైఁ బూనుకొన్నట్టి
కౌరవుల్ నిజకులక్షయమహాపాత
కమ్ముఁ గానరు, వారు గనకుండ్రు గాక
ఘోరత రాత్మీయకులనాశకలిత
గురుదోషమును గనుంగొనుచున్న మనము
పారమ్ము లేని యిప్పాపార్ణవమునఁ
బడకుండ మరలుకో వలవదే కృష్ణ !

కులనాశ మొనరింపఁ గులధర్మము లడంగుఁ
గులధర్మహాని నెక్కొనియె నేనిఁ
జెడిపోవుదురు కులస్త్రీలు దానను వర్ణ
సంకరం బగు వర్ణసంకరమునఁ
బిండోదకములు లోపించి తత్పితరులు
గూలుదు రాకులఘ్నులగు జనులు
సతము నారకనివాసము నొంది వెతలఁ గుం
దుదు రంచు నెందు విందుమ కదయ్య !

అకట మనమెంత పాపమ్ముగ నాచరింపఁ
బూనుకొంటిమి చూచితే గ శ్రీనివాస !
రాజ్యసుఖలోభమునను దుగరంతమైన
స్వజనసంహార మొనరింపఁగ జేనునె మనకు.

ఎదిరి మాఱుసేయగ కిట శస్త్రములు వీడి
యూరకున్న నన్నుగ నొక్క పెట్ట

మొనసి ధార్తరాష్ట్రున్ లనిఁ జంపుదురయేని
నదియు నాకు మేలన్ యగుఁ జేమయ్య!

(అని కనికరమ్మున విల్లునమ్ములు విడిచి పెల్లు దురపిల్లుచేఁ దేరిపైఁ జదికిలంబడి కన్నీరు గాఱ నూరకుండును.

కృష్ణుఁడు:- (సంభ్రమాశ్చర్యములతో) అర్జునా! ఇది యేమి?

అకట! కడిఁది యొదున్దుకువేళ నీ కేల
తగని వగపిన్ దిట్లున్ దాఁపరించె?
నిది యనార్యకార్యన్ మిది స్వర్గపదదూర
మిది యకీర్తిద మనిన్ యెంచవేమి?

పేడితన మ దింకన్ వీడలేదే పార్థ!
యయయొ! యూర కిట్లున్ లైతివేల?
మనసుపేదఱికమున్ మాని లే లెమ్మ! యీ
దారి దగునె పరవిన్దారి! నీకు.

అర్జునుఁడు:- (సంశయగ్రస్తచిత్తముతో) మధుసూదనా!

అకటకట! పూజార్హులగు ద్రోణభీష్ములం
బూలఁ బూజింపఁగాఁ బోలెడుం గాక
పదరి యాలమున బిట్టెదురుకొని కఱకువా
లంపవానల వారి నొంపఁగాఁ దగునె
మాననీయాత్ముల మహానుభావుల గురులఁ
ద్రుంచి పెన్నెత్తుటం దోఁగు భోగముల
ననుభవించుటకంటె నవని బిచ్చెపుఁ గూటి
బ్రదుకె మే లని మదిన్ భావింతుఁ జూవె
భిక్షాటనమొ లేక భీకరానీకమో
యీ రెంటిలోన మే లేదియో యెఱుఁగ.

మనము గెలుతుమొ వారు మనల గెలుతురో యిట్టి
గెలుపోటములును మే ల్గొలుపునే కృష్ణ !
యెవ్వారిఁ జంపి జీవింపఁగా నొల్లమో
యిపుడు వారెల్ల మన యెదుట నున్నారు
నిస్సపత్నప్రాజ్యనిఖిలావనీరాజ్య
మమరాధిపత్యమ్ము నబ్బెడుం గాక
యింద్రియమ్ముల నేర్చు నీశోకశిఖి యాఱ
దిది యార్చుకొను వెరవు నెఱుఁగకున్నాఁడ
ధర్మసమ్మూఢచేతస్కుండఁ గార్పణ్య
పటుదోషనిహతస్వభావుండ నగుట

నిన్నడుగుచున్నాఁడ నీదు శిష్యుఁడ నిన్ను
నాశ్రయించితి నన్ను నర్థి శాసించి
నిజసంశయము దీఱ నిఖిలధర్మవిధిజ్ఞ !
యేది మేలో నాకు నెఱిఁగింపవయ్య !

కృష్ణుఁడు:- (తనలో) అవురవురా ! గొప్ప విషమపరిస్థితి యేర్పడినదే ; ఇరువాఁగును యుద్ధమునకు సిద్ధమై యొండొరులపై శస్త్రాస్త్రములఁ బ్రయోగించుకొను సమయమునఁ బార్థుఁ డిట్లయ్యె ; ఇవ్వీరవరు నెట్లు దేర్తును ? అధ్యాత్మతత్త్వమందలి నిష్కామకర్మయోగోపదేశమే దీనికి సాధనము ; అందులకు వ్యవధి చాలదే ; (ఇంచుకసేపు చింతించి) కానీ ; తెలిసినది.

నా దివ్యమహిమచేఁ బదునెనిమిది నిముసముల కాలము పదునెనిమిది గడియలుగా- మార్చి యధ్యాత్మతత్త్వోపదేశ మొనర్చి యర్జునునిం దేర్చి యుద్ధసన్నద్ధునిగా నొనర్చెదఁగాక ! (కలకల నవ్వి; ప్రకాశముగా) అర్జునా ! ఇదియా నీ సంశయము ?

తగదు తగ దిది పార్థ ! వ్యర్థపు
వగపు గొన నీ యంతవానికి
దిగులి దేమిటి కయ్యయో ! నీ
తెగువ నేఁ డెటు వోయెనో ?

వగవఁగూడని వారికై యిటు వగపుఁ జెందుచు నున్నవాఁడవు
మిగులఁ దెలిసిన వానివలె గడిమీఱి పగ్గెలు వలికె దవురా !
జగతిఁ జచ్చిన వారిఁ గూర్చియుఁ జావకుండిన వారిఁ గూర్చియు
వగవ రెన్నఁడు నాత్మతత్త్వపు వల నెఱింగిన పండితుల్.
తగదు......

అన్న ! నేనును నీవు నీ నృపు లపుడు నిపుడును నెపుడుఁ దిరముగ
నున్నవారమె యందఱము లేకునికి లేద యొకప్పుడేనియుఁ
మున్ను బాల్యముఁ బిదప జవ్వనమును బదంపడి ముదిమి దేహము
గొన్నటులు దేహికిని దేహము సన్న నింకొక దేహ మబ్బెడు
నెన్నఁడును మోహమును గనఁ బోఁ డిందు ధీరుఁడు ఫల్గునా !
తగదు......

చెలియు వేఁడియు సుఖము దుఃఖముఁ గొలుపు మాత్రాస్పర్శగుణములు
గలిగి తొలఁగుచు నుండు సతతములు గావు వాని సహింపు మర్జున !
కలఁగి వానికి లోనుగాక సుఖమ్ము దుఃఖము నొకటిగాఁ గొను
నలఘుమతియగు ధీరపురుషుం డమృతపదమును బొందెడున్.
తగదు......

లేనిదానికి నునికి లే దిఁక లేకునికి లే దున్నదానికిఁ
బూని యీ యిరుదెఱఁగు నిర్ణయమును గ్రహింతురు తత్త్వవేత్తలు

ఈ నిఖిలజగ మలమి నాశము లేనిదై యది తేజరిల్లెడు
దాని నవ్యయవస్తువును నెవఁడేనియుం జెఱుపంగఁ జాలఁడు
మేను లివి నశ్వరము లాత్మ యమేయ మప్రవినాశి నిత్యము
గాన నింత యెఱింగి పోరికిఁ గడఁగవే భరతర్షభా!

తగదు......

అనఘ! యీ పరమాత్మ చంపెడి ననియు మఱియును జంపఁబడియెడు
ననియుఁ దలఁచుట తెలివిమాలినతనము చంపదు చావ దయ్యది
జననమరణము లాపరాత్మకు సంభవింప వొకప్పుడేనియు
నెనరఁ గొన్నాళ్లుండి మఱి లేకుండు టనునది లేదు దానికి
ఘనతరము శాశ్వతము నిత్య మఖండ మజము పురాతనం బది
తనువు దెగినను దాను దెగ దీ తత్త్వనిర్ణయబుద్ధి గలిగిన
జనుఁ డెటులు సంపించు నెవ్వనిఁ జంపు నిది యూహింపుమా!

తగదు......

నరుఁడు చిరిఁగిన ప్రాఁతవలువలఁ దొఱఁగి క్రొవ్వలువల ధరించెడు
కరణి నాత్మయు జీర్ణతనువులఁ దొఱఁగి క్రొత్తయొడళ్లు దాల్చెడు;
కర మదాహ్యం బగుట నగ్గిని గాల దచ్ఛేద్యం బగుట వి
స్ఫురితశస్త్రప్రహతులఁ దునియ దశోష్య మగుటను గాలి నిగురదు
పరఁగ నక్లేద్యంబు గావున వారిఁ దడియదు సూవె యది శ్రీ
కర మచింత్యం బచల మది యవికార్య మవ్యక్తంబు నిత్యము
నిరవధికము సనాతనం బది నిస్సమాధిక మవ్యయము సు
స్థిరము సర్వంగతము శేషి యశేషకారణకారణం బది
పరమమగు నయ్యాత్మ నాశముఁ బొరయునది గా దిది యెఱిఁగి యో
పురుషశేఖర! శోకమున్ విడి దుర మొనర్పఁగఁ బూనవే.

తగదు......

పుట్టుసావులు దప్ప వాత్మకు నెట్టులేనియు నని తలంచెదొ
యట్టులైన మహాభుజా! యిటు లాత్మఁ గుందఁగ నీకు నొప్పదు

పుట్టువారలు గిట్టుటయు మఱి గిట్టువారలు పుట్టుటయు ధ్రువ
మెట్టు దప్పని విషయమున నీ కేల శోకము సెప్పుమా!
తగదు......

ఎఱుఁగ రెవ్వరు భూతముల మొద లెట్టిదో తుద యెట్టిదో మఱి
యెఱుఁగఁ బడునది పుట్టుసావుల యీ నడిమిబ్రదు కొక్కటే కద!
వెఱఁగుపాటునఁ జూచు నెక్కఁడు వెఱఁగుమై నాలించు నెక్కఁడు
వెఱఁగు పైకొనఁ బలుకు నొకఁ డివ్విధిని గనియును వినియుఁ బలికియు
నెఱుఁగఁ డెట్లును నా పరాత్పరు తెఱఁ గి దిట్టి దటంచు నొకఁడును
నెఱి సమస్తశరీరములలో నెగడు నాత్మ యవధ్య మని నీ
వెఱిఁగికొని భూతముల పట్టున నీ యడలు విడు మర్జునా!
తగదు......

అని స్వధర్మం బని యెఱింగియు నడలఁ దగునే క్షత్త్రియునకున్
వినుతధర్మరణమ్ము కంటెను వేఱు శ్రేయ మ్మొకటి గలదే
తనకుఁ దా నలవోక వివృతద్వారమై పొడకట్టు స్వర్గమె
యనఁ దగిన యిటువంటి సంగర మబ్బుక్షత్త్రియు లెంత ధన్యులో
యనఘ! నీ వీ ధర్మయుద్ధము నాచరింపక యుండు దేనియుఁ
దనదు ధర్మంబునకుఁ గీర్తికిఁ దప్పి పాపము నొందెదవు సూ
జనులు నీ యపకీర్తి నెప్పుడుఁ జాటుచుందురు శూరు లగు స
జ్జనుల కీ యపయశముకంటెను జావు మే లనిపించుఁ గాదే
మనమునన్ భయ మంది యుద్ధము మానుకొంటి వటంచు నినుఁ జే
ల్కానగఁ జూతురు మున్ను నినుఁ గడు గౌరవించు మహారథోత్తము
లనయ మహితులు పెక్కుదెఱఁగుల నాడఁగూడని మాటలాడుచు
ఘనుని నిను నిందింతు రింతటికంటెఁ గష్టము వేఱ యున్నదె
యని జయించిన ధరణిరాజ్యం బనుభవింతువు దెగిన స్వర్గముఁ
గనుదు లాభాలాభములను సుఖము దుఃఖము జయము నపజయ

ముని సమమ్ముగ నెంచి యాహవమునకుఁ గడఁగుము లెమ్ము కిరీటిఁ
గనుము దీనను నీ కఘము గల్గదు సుమా వీరోత్తమా !
తగదు......

సీ. కౌంతేయ ! సాంఖ్యసంగతబుద్ధి నీ కిప్డు
తెలుఁగఁ జెప్పితిఁ జేవెర యింక మీఁద
యోగసంగతబుద్ధియును వచించెద దీనఁ
బటుకర్మబంధముం బాయఁగలవు
ప్రారంభనాశమ్ము వాటిల్ల దివ్విధా
నమ్మునం బ్రత్యవాయమ్ము లేదు
అతుల మీధర్మ మత్యల్ప మైనను మహా
భయములం బాపి కాపాడఁగలదు

తే. గీ. నిశ్చయస్వభావముతోడ నెగడు బుద్ధి
యరయ నిర్వ్యాడ నొక్కటే యగుఁ జేమయ్య
యనియతాత్ముల బుద్ధు లనంతబహుళ
వివిధశాఖోపశాఖలై వెలయుఁ బార్థ !

వేదవాదములయం దాదరము గలవారు
వేదకర్మముకంటె వేఱు లే దనువారు
కామానుసక్తి స్వర్గమును గోరెడువారు
వ్యామోహహతబుద్ధులగు నజ్ఞులు సుమన్న !
వివిధభోగైశ్వర్యవిభవములఁ జేవిసూపి
భవబంధములఁ గట్టువఱుచు వైదికకర్మ
జాలమే మేలంచుఁ బూలు వెదచల్లి నటు
లోలిఁ బల్కెడువారి యుక్తులను నెఱనమ్మి
లలితభోగైశ్వర్యలాలసుల మనమునం

గలితనిశ్చయబుద్ధి గలుగ దెన్నఁడుఁ బార్థ!
కాన నీకును జన్మకర్మబంధము లుడుపు
మాననీయసుయోగమార్గమ్ము వివరింతు
నీ వెమ్మదిని దీని నెలకొల్పు మా ఫల్గునా!

కర్మబంధముల ఖండించెడు నీ నిర్మలయోగము నీ మది నిడికొని
దుర్మమకారముఁ ద్రోసిపుచ్చి కుల
ధర్మ మొనర్పవె ధర్మనిధీ!
కర్మబంధముల......

త్రిగుణార్థమ్ములఁ దెలుపు వేదములు
త్రిగుణసంగతిని దగులకు మర్జున!
విజ్ఞుండగు బ్రహ్మజ్ఞానికి దు
ర్విజ్ఞేయములగు వేదము లేటికి
జగతి నెల్లెడల జలము వెల్లిగొన
దిగుడు బావిలో దిగఁగా నేటికిఁ
జలి వేఁడియు మునుగల ద్వంద్వమ్ములఁ
గలిగెడు సుఖదుఃఖములకు లోఁగక
కలుగని యర్థముకై యాసింపక
కలిగిన దానిం గావం బూనక
శుద్ధసత్త్వగుణసుస్థితి సంపరి
బుద్ధాత్ముఁడవై పొందవె పార్థా!
కర్మబంధముల......

కర్మమునన యధికారము నీ కా
కర్మఫలమ్ములఁ గలుగం బో దది

కర్మఫలములకుఁ గతమై పోకుము
కర్మము నెడ విముఖతఁ గైకోకుము
కలిగినఁ గానీ కలుగక పోనీ
ఫలసిద్ధికినై ప్రాఁకులాడ కెద
సమబుద్ధిని గొని సంగము వీడ్కొని
యమలినయోగమునందును నెలకొని
మమతఁ దొఱఁగి కర్మములం జేయుము
సమబుద్ధియ చుమి చేకొని యోగము
కర్మబంధముల......

బుద్ధియోగమును బొందని కర్మము
శుద్ధము గామిని జేలుకని దయ్యోడు
బుద్ధిని శరణముఁ బొందుము ఫలసం
సిద్ధిఁ గోరు దుర్బుద్ధులు కృపణులు
బుద్ధియుక్తుఁ డలపుణ్యాపాపముల
నిద్ధర విడి తరియించెడుఁ బార్థా!
కర్మబంధముల......

కర్మయోగమును గైకొను మర్జున!
కర్మకౌశలమె ఘనయోగం బగుఁ
గర్మఫలములఁ గాంక్షింపక స
త్కర్మము లొనరుచు ఘనయోగులు భవ
నిర్ముక్తిం గని నియతనిరామయ
శర్మదమోక్షస్థానముఁ గాంతురు
కర్మబంధముల......

ఎప్పుడు నీమతి యెసకొను మోహపుఁ
గప్పను చీఁకటిఁ గడచి వెలుంగును

యప్పుడ వినఁదగునది వినునదియును
దప్పక నిర్వేదము నిడు నీకును
నెప్పుడు వినుకలి నెసఁగెడు కలఁతకుఁ
దప్పి సమాధిని దగిలి తిరంబయి
యొప్పునో నీమతి యప్పుడ యోగము
చేపడఁ గాంతువు సూవే పార్థా!

కర్మబంధముల......

అర్జునుఁడు:- (సవితర్కముగా) కృష్ణా!

ఆ. వె. అచలమతి సమాధియందు నూల్కొను స్థిత
ప్రజ్ఞుఁ డెట్టిఁ డెట్లు వలుకు నాతఁ
డెట్టు లుండు మఱియు నెటు సంచరించు నా
కింత యెఱుఁగఁ జెప్పవే మహాత్మ!

కృష్ణుఁడు:- (ఉల్లాసముతో) అర్జునా! చక్కఁగా నడిగితివి. నీ యడిగిన స్థితప్రజ్ఞుని లక్షణము లెట్టివో వివరించి చెప్పెద, వినుము.

తనుఁ దా నెఱిఁగి తన్నుఁ దనలోనఁ గనుఁగొంచుఁ
దనకుఁ దా నయియుండి తనిసి యుబ్బెడువాఁడు
మనసులో నెల్లపుడు మలయు కోరిక లెల్ల
మడఁచి నిస్పృహావృత్తి మన నేరిచినవాఁడు
అలము సుఖదుఃఖముల నాస కలఁతయు లేక
యలుక కూరిమి వెఱపు నందకుండెడువాఁడు
ఒలసెడు శుభాశుభము లొకటిగా నెన్నుకొను
చూర కేదియు నంటకుండ వర్తిలువాఁడు
కడఁకఁ దాఁబేటి యంగములట్లు విషయాను
గతి నుడిపి యింద్రియోత్కరము లోఁగొనువాఁడు

అడరు విషయములం దభిలాషయును లేక
యాత్మసాక్షాత్కార మంది రంజిలువాఁడు

ప్రజ్ఞానిధులు స్థితప్రజ్ఞుఁడని చెప్పుదురు
సుజ్ఞానమున స్థితప్రజ్ఞుఁడయి నీవు రణ
యజ్ఞమును ధర్మగతి నాచరింపవె ఫల్గునా !

బహుయత్ననిరతుఁడగు పండితుని మదినైన
బలిమిమై హరియించు బలవదింద్రియగణము
మత్పరుండై యోగతత్పరుండై యుండు
వాని కింద్రియచయము వశవర్తియై యుండు
విషయములఁ దలపోయ విషయాభిరుచి గలుగు
విషయాభిరుచి గలుగ విస్తరిల్లును గోర్కి
కోర్కివలనం బుట్టుఁ గ్రోధమ్ము క్రోధమ్ము
వలన మోహ మ్ముప్పతిలు మోహమునఁ జేసి
స్మృతివిభ్రమము వొడము స్మృతి చెడిన బుద్ధి చెడు
బుద్ధి చెడినంత నప్పురుషుండు చెడిపోవుఁ
దనకు లోపడి రాగమును ద్వేషమును బొంద
కిచ్ఛానుగతి మెలఁగు నింద్రియమ్ములచేత
మనుగడకుఁ గొనక తప్పని విషయములఁ గొనెడు
సువిధేయచిత్తుండు సుప్రసన్నతఁ గాంచు
నలప్రసన్నాత్మున కఖిలదుఃఖములు వోయి
నిర్మలత గని బుద్ధి నిశ్చలంబై యుండు
యోగసంగతుఁడు గాకున్నఁ గల్గదు బుద్ధి
భావనాపటిమ చొప్పడ దయుక్తాత్మునకు
నాత్మభావన లేక యబ్బదు మనశ్శాంతి
శాంతి లేకున్నచో సౌఖ్యమ్ము లే దన్న

విషయానుగతవిషయి వివశాత్మకుని ప్రజ్ఞ
కడలి లోఁ దెరవోడ గాలిచే బలెఁ దూలుఁ
గాన యేవంవిధానూనేంద్రియగణమ్ము
నిర్జించు ప్రజ్ఞాననిష్ఠుఁడగు సుజ్ఞాని

ప్రజ్ఞానిధులు స్థితప్రజ్ఞుఁడని చెప్పుదురు
సుజ్ఞానమున స్థితప్రజ్ఞుఁడయి నీవు రణ
యజ్ఞమును ధర్మగతి నాచరింపవె ఫల్గునా !

అఖిలభూతముల కెయ్యది రాత్రియై యుండు
నందు సంతతము సంయమి మేలుకొని యుండు
నెందు భూతగణమ్ములెల్ల మేల్కొని యుండు
నది యాత్మదర్శియగు యతికి నిసియై యుండుఁ
బరమార్థతత్త్వమ్ము ప్రాణికోటికి రాత్రి
బహుళలౌకికవృత్తి పరమయోగికి రాత్రి
తనలోనఁ జేరఁబాఱు ఘననదీజలము లోఁ
గొనుచు నచలస్థితిని మను సముద్రుఁడువోలెఁ
దనుఁ బొందు కోరికలఁ దనయాత్మలో నణఁచి
యచలుఁడగు యోగి యత్యంతశాంతిని గాంచు
విషయానుభూతి కువ్విళు లూర్చు కామములఁ
గామించు కామికిం గలుగ దెన్నఁడు శాంతి
నిఖిలకామము లుడిగి నిర్మముఁడు నిస్పృహుఁడు
నిరహంకృతియు నైన పురుషుఁ డొందును శాంతి
యిది బ్రాహ్మి యైన స్థితి యిద్దానిఁ గైకొన్న
పురుషుండు మోహమ్ముఁ బొందఁ డెందును పార్థ !
యంతకాలమ్మునం దైన దీనను నిల్చి
బ్రహ్మనిర్వాణముం బ్రాపించెడుం జూవె.

యిట్టి యోగికరాజ్యపట్టమ్ము గట్టుకొని
యద్వితీయానంద మనుభవించెడు యోగి

ప్రజ్ఞానిధులు స్థితప్రజ్ఞుఁడని చెప్పుదురు
సుజ్ఞానమున స్థితప్రజ్ఞుఁడయి నీవు రణ
యజ్ఞమును ధర్మగతి నాచరింపవె ఫల్గునా!

అర్జునుఁడు:- (సవితర్కముగా)

కమలాక్ష! కర్మమ్ముకంటె జ్ఞానమ్ము
కడు మేలను తలంపు గలవేని ఘోర
సమరకర్మ మొనర్చి స్వజనులం జంపఁ
జేను నంచు నిటు నన్ను శాసించె దేల?
అమితసందిగ్ధవాక్యముల నా బుద్ధి
నలయించి కలఁగించిన ట్లయ్యెఁ జూవె
యమృతసంసిద్ధికై యారెంట నాకు
నది మేలొ యిది మేలొ యాన తీవయ్య!

కృష్ణుఁడు:- ధనంజయా! నింగి కెగురు పులుంగునకు రెండు ఱెక్కలుం బోలె ముముక్షువునకుఁ గర్మజ్ఞానయోగమ్ములు రెండును నావశ్యకమ్ములై యుండు. అందును నిష్కామకర్మయోగమ్ము సమస్తకర్మబంధములం బాపి జ్ఞానప్రాప్తికి సాధనమై బ్రహ్మనిర్వాణపదసిద్ధిహేతువై యొప్పు; కావున—

కర్మయోగి వయి నిర్మలబుద్ధిని గర్మము లెల్ల మదర్పితములుగా
నిర్మమనిస్పృహావృత్తిని గైకొని నెవ్వగ వీడ్కొని నీ సుక్షత్రియ
ధర్మ మయిన రణకర్మ మొనర్పవె
ధర్మాచరణోద్ధరణాభరణా!
కర్మయోగి వయి......

నిర్మలసిద్ధికి రెండు దెఱంగుల
నిష్ఠలు గలవని నే మును సెప్పితిఁ
గర్మయోగమున జ్ఞానయోగమునఁ
గాంతురు సిద్ధిని యోగులు సాంఖ్యులు
కర్మాచరణము గావింపక నై
ష్కర్మ్యము నొందఁగఁ జాలఁడు పురుషుఁడు
కర్మము లొనరుప కుండిన మాత్రన
కలుగదు సిద్ధి జగమ్మున నరులకు
కర్మముఁ జేయక యెవ్వండును నొక
క్షణమును నూరకయుండఁగ నేరఁడు
కర్మము నవశతఁ బ్రకృతిగుణమ్ముల
కతమున నెల్లరుఁ జేయుచు నుందురు
కర్మేంద్రియములఁ గట్టిడి విషయో
త్కరముల కెద నువ్విళులూరుచు ని
ష్కర్ముని పోలిక వెలికిఁ గనంబడు
కపటాచారుఁడు పాపాత్ముం డగు
నిర్మమతం గొని మనమున నింద్రియ
నిగ్రహ మొనరిచి నిస్సంగుండై
కర్మేంద్రియములఁ గర్మయోగమును
గావించెడు వాఁ డుత్తమపురుషుఁడు
కర్మ మకర్మముకంటెను శ్రేష్ఠము
గాన నియతకర్మములం జేయుము
కర్మముఁ జేయకయుండిన నీకును
గాయయాత్రయును గడవదు గాదే

కర్మము యజ్ఞార్థము గాకుండిన
ఘనబంధన మగు నది లోకమునకుఁ
గర్మము నీవు తదర్థ మసక్తతఁ
గైకొని చేయం గదవే పార్థా !
కర్మయోగి వయి......

తొల్లి ప్రజాపతి ప్రజలను యజ్ఞము
తోడ సృజించి వచించె నిటుల్ "మీ
కెల్లయభీష్టము లిది యిడు దీన ర
హిన్ సురలోకముఁ బెంపొందింపుఁడు
సురలను మీరలు దనియించిన నల
సురలును మిముఁ దనియించెద రిట్లొం
డొరులను దృప్తులఁ జేసికొనుచే మీ
రొందుఁ డిహమ్ముఁ బరమ్ము సతమ్మును
ధృతిమెయి యజ్ఞములం గడుఁ దనిసిన
దేవత లీప్సితభోగము లిత్తురు
కృతమతి నొసఁగక వా రిడునది గొను
కితవులు దొంగలె" యని పల్కెను విధి;
దేవయజ్ఞమున మిగిలిన యమృతముఁ
దిను బుధు లఘములనెల్ల నడంతురు
కేవలకుక్షింభరులై కుడిచెడు
కిల్బిషచిత్తులు పాపమె కుడుతురు
అన్నమువలనం గలిగెడు భూతము
లన్నము వర్షమువలనం గలిగెడు
నన్నా! యజ్ఞమ్మున నగు వర్షము
యజ్ఞము కర్మమువలనం గలిగెడు

ఘనమగు కర్మము వేదమువలనం
గలిగెడు వేదము బ్రహ్మసముద్భవ
మనయము సర్వగత మ్మగు వేదము
యజ్ఞమునందుఁ బ్రతిష్ఠిత మయ్యెడు
ననుపద మీగతి జేరగెడు చక్రము
ననువర్తింపని కుమతికి నఘుజీ
వనునకు నింద్రియలోలాత్మకునకు
బ్రదుకు వృథా యగుఁ జూవే పార్థా!
కర్మయోగి వయి....

ఆత్మన యెపుడు రమించెడు వానికి
నాత్మన తృప్తినిఁ జెందెడు వానికి
యాత్మన సంతుష్టుం డగువానికి
నాచరణీయము లేద యొకండును
చేఁతలవలనం బని లే దతనికిఁ
జేయకయుండిన లే దొక దోసము
భూతగణాశ్రయమున నాతని
కిని బొందఁగ వలసిన యది లే దేదియు
భూవలయమ్మున నాత్మజ్ఞుని న
ప్పురుషుని జీవన్ముక్తుం డందురు
జీవన్ముక్తత చేకుఱు నంతకుఁ
జేయందగినది కర్మయోగమే
కాన ననక్తతఁ గర్తవ్యంబగు
కర్మము సతతము నీ వొనరింపుము

పూని యనసక్తతఁ గర్మముఁ జేసెడు
పురుషుఁడు మోక్షముఁ బొందెడుఁ బార్థా!
కర్మయోగి వయి......

కర్మాచరణముచేతన కాదే
కాంచిరి సిద్ధిని మును జనకాదులు
కర్మచయమ్ముల లోకసంగ్రహము
కై యొనరించుట నీకును విధియగు
శ్రేష్ఠుఁడు దేనిని జేయును దానిన
చేయుచు నుండుదు రితరజనమ్ములు
శ్రేష్ఠున కేది ప్రమాణమొ దానిన
చేకొని లోక మ్మనువర్తించును
ఎందును గర్తవ్యం బగునది నా
కేదియు లేదు త్రిలోకములందును
నందని దందఁగఁ దగినది లే ద
ట్లయ్యును గర్మము లొనరుతు నేనును
అనలసవృత్తి నొకప్పుడు కర్మము
లాదృతి నే నొనరింపక యుండిన
మనుజులు సర్వవిధమ్ముల నాదగు
మార్గము ననువర్తింతురు గాదే
కర్మములే మానినచో నీ లో
కములు నశించెడు సంకరమయ్యెడు
ధర్మము చెడిపోవుఁ బ్రజ రూపఱు నిం
తకు నేఁ గారణ మయ్యెదఁ జూవే
సర్వేశుఁడ నగు నాకే కర్మా
చరణము కర్తవ్యం బగుచుండఁగ

సుర్వార నన్న్యులకును గర్మంబుల
నొనరించుట విధి గాదే పార్థా!
కర్మయోగి వయి....

అజ్ఞం డెట్టులు కర్మమ్ములను ఫ
లాసక్తుండయి చేయునో యట్లే
ప్రాజ్ఞుఁ డసక్తత లోకసంగ్రహము
పాటించుటకై చేయఁగ వలయును
కర్మసంగులకు మతిభేదమ్మును
గలిగింపం జేన దెందును బ్రాజ్ఞుఁడు
కర్మము లెల్ల నసక్తత సక్తుని
గతిఁ దాఁ జేయుచుఁ జేయింపం దగుఁ
బ్రకృతిగుణమ్ముల కతనం జేయిం
పంబడుఁ గర్మము లెల్లవిధమ్ముల
నకట! యహంకృతి మూఢుఁడు దలఁచెడు
నప్పనులకుఁ దాఁ గర్త నటంచును
గుణకర్మైకవిభాగవిదుం డగు
గురుతత్త్వజ్ఞం డింద్రియగుణములు
గుణములయందును వర్తించెడు నని
గుర్తెఱుఁగుచుఁ దా నెందును దగులఁడు
గుణకర్మములఁ దగుల్కొను మాయా
గుణసమ్మోహితులగు మందులకును
గుణవిదుఁడగు నాత్మజ్ఞుఁడు భేదము
గొలుపంగూడదు సూవే పార్థా!
కర్మయోగి వయి....

ఈ నా మతము నసూయ వహింపక
యెవ్వరు నిత్యము శ్రద్ధాపరులై
పూని యొనర్తురో వారలు కర్మ
మ్ముల తగు లొందక ముక్తినిఁ గాంతురు
ఈ నా మతము నసూయాపరులై
యే నరు లనువర్తింపరో యా య
జ్ఞానవిమూఢవివేకవిహీనులు
సద్గతిఁ బాసి వినాశముఁ గాంతురు
ప్రకటవివేకులు సైతము తమతమ
ప్రకృతినిబట్టి చరించేచే నుందురు
సకలభూతములు ప్రకృతిని దాఁటఁగఁ
జాలవు, నిగ్రహ మేమి యొనర్చెడు ?
నిరతము సర్వేంద్రియవిషయమ్ముల
నెలకొని యుండును రాగము ద్వేషము
పురుషుం డా రెండింటికి లోపడి
పోరా దయ్యవి వానికి శత్రులు
గురుగుణమగు పరధర్మముకంటె వి
గుణ మైనను నిజధర్మము మేలై
పరఁగు స్వధర్మముననుజావును మేల్
పరధర్మము భయదం బగుఁ బార్థా !
కర్మయోగి వయి.....

అర్జునుఁడు:– వృష్ణికులశేఖరా !

ఒచ్చెముల నొనర్పక నిచ్చ లేకున్నను
బలిమి చేనిచేతక బంటువోలె

నరుఁడు దేనిచేతఁ ఽ బురికొల్పఁబడి పాప
మాచరించుఁ దెల్పుఽ మయ్య! నాకు.

**కృష్ణుఁడు:**— అర్జునా!

సీ. ఉరురజోగుణవార్ధిఽ నొదవు హాలహలమ్ము
బంధుర క్రోధాగ్నిఽ కింధనమ్ము
కొలలేని బలితంపుఁఽ గొలలకున్ నిలయమ్ము
నిండుభోగపుఁగూటిఽ తిండిపోతు
విస్తారసంసారఽ విషవల్లికిం బాదు
శోకవిద్రోహమోఽ హాకరమ్ము
అధ్యాత్మచింతామృఽతాబ్ధిబాడబవహ్ని
నిర్మలజ్ఞానికిన్ ఽ నిత్యవైరి
అగ్నిఁ బొగయు మించుఽటద్దముం బెందూళి
గర్భశిశువు మావిఽ గప్పినట్లు
మించు జ్ఞాన మావఽరించు కామము నరుం
బాపములకుఁ బాలుఽవఱచుఁ జూవె.

అనఘ! యింద్రియములుఽ మనసు బుద్ధియు నాశ్ర
యములు కామమునకుఽ నని వచింతు
రేతదాశ్రయములఽచేత నక్కామమ్ము
దేహిఁ దెలివి నడఁచిఽ మోహిఁ జేయు.

కానఁ దొలుదొల్త నింద్రియోఽత్కరము గెలిచి
కలుషసంతతులకు నాదిఽకారణమ్ము
జ్ఞానవిజ్ఞానధనవినాఽశకము నైన
యట్టి కామమ్ము నిర్జింపుఽ మయ్య! పార్థ!

తనువుకంటె నింద్రియము లుత్తమము లింద్రి
యములకంటె నెమ్మన ముత్తమము మనమ్ము
కంటె బుద్ధి శ్రేష్ఠము బుద్ధికంటె శ్రేష్ఠ
మైనదై సర్వసాక్షి యయ్యాత్మ యలరు.

బుద్ధికిం బరమా తదాత్మను బుద్ధి నెఱింగి నిజాత్మ నాత్మని
బద్ధ మొనరిచి కామశత్రువుఁ బాఱఁదోలి జితేంద్రియతఁ గొని
బోద్ధవై తత్కర్మయోగముఁ బూని నిజకులధర్మ మగు నీ
యుద్ధకర్మ మొనర్చి కీర్తి నొందవే భరతర్షభా !

సీ. అవ్యయ మ్మగు నిమ్మహాయోగమును నేను
సృష్ట్యాది నినునకుం జెప్పినాఁడ
దిననాథుఁ డెఱింగించె మనువున కమ్మను
విక్ష్వాకునకు దీనిఁ నెఱుఁగఁ జెప్పె
నీగతి వరుసమైఁ నిద్దాని జనకాది
వితతరాజర్షిసంతతి యెఱింగెఁ
జాలకాలం బిట్లు జేరుగ నా యోగమ్ము
నశియించిపోయె నానాఁటి కవని

నతిపురాతన మతిరహస్యమ్ము విమల
ముత్తమోత్తమ మైన యీయోగ మదియు
నెచ్చెలివి భక్తుఁడవు నాకు నీవు గానఁ
బ్రీతి నిట దీని నీకుఁ జెప్పితిని పార్థ!

అర్జునుఁడు:— (సంశయముతో)

సర్గమునకు నాదిని జనియించె సూర్యుండు
నీవు నేఁడు పుట్టినావు కృష్ణ !

నాఁటి సూర్యునకునుక్ నేఁటి నీ వీ యోగ
మెట్లు చెప్పినావొక్ యెఱుఁగ నైతి.

**కృష్ణుఁడు:**– ఫల్గునా !

నాకు నీకును బెక్కులగు జననమ్ము లింతకుఁ గడచి పోయెను
నాఁక వన్నియుఁ దెలియుఁ దెలియవు నీకు నయ్యావి భారతా !
అజుఁడ నయ్యును నవ్యయాత్ముఁడ నయ్యు భూతేశ్వరుఁడ నయ్యును
నిజమహాప్రకృతిన్ స్వమాయను నేను లోఁగొని పుట్టుదున్.
ఎప్పు డెప్పుడు ధర్మ మేపఱి యిల నధర్మము పెరిఁగిపోవునొ
యప్పు డపుడు సృజించుకొందుఁ జేమయ్య నను నే నర్జునా !
శిష్టరక్షయు దుష్టశిక్షయుఁ జేసి ధర్మము నిల్పుటకునై
స్రష్టనై యుగయుగమునందును సంభవించుచు నుండుదున్
అరసి నా దగు జన్మకర్మము లవని దివ్యము లని యెఱింగిన
నరులు మెయి విడి మరలఁ బుట్టక నన్నుఁ బొందుదు రర్జునా !
అలుకఁ గూరిమి వెఱఁ దొఱఁగి న న్నాశ్రయించిన బ్రహ్మవేత్తలు
కలితముక్తులు జ్ఞానపూతులు గలరు పెక్కురు ఫల్గునా !
ఏది యెవ్వరు గోరి కొలుతురొ యిత్తు దానిన వారి కేనును
నాదు మార్గము ననుగమింతురు నరులు సర్వవిధమ్ములన్
కర్మసిద్ధిని గోరి దైవతగణములన్ యజియింతు రిమ్మహిఁ
గర్మజమ్మగు సిద్ధి నరలోకమున సత్వర మబ్బెడున్
నరుల గుణకర్మముల పాల్గొని నాల్గువర్ణము లే సృజించితిఁ
గరము దీనికిఁ గర్త నయ్యు నకర్త నవ్యయుఁడం జేమీ
నన్నుఁ గర్మము లంట వని మఱి నాకుఁ గర్మఫలేచ్ఛ లే దని
నన్నుఁ దెలిసికొనంగ నేర్చిన నరుని నంటవు కర్మముల్.

పూని యింత యెఱింగి పూర్వము
ముక్షులుం గర్మములఁ జేసిరి
కానఁ బూర్వులు చేసినట్టిది
కడుఁ బురాతన మైనయట్టిది
మాననీయ మకామకర్మము
మదిని గొని నీ వంశధర్మం
బైన యీ రణయజ్ఞకర్మము
నాచరింపవె ఫల్గునా!

కర్మ మేదియొ మఱియు నకర్మ మేదో
దీని కలరూపు సుకవులుం దెలియ లేరు
నీ కెఱింగింతుఁ దత్కర్మ నిర్ణయమ్ము
నది యెఱింగిన మోక్ష మందెదవు పార్థ!

శ్రుతివిహితకర్మమ్ము చేపట్టుంగఁగవలయుఁ
బ్రతిషిద్ధమగు వికర్మము రీతిఁ గనవలయుఁ
గర్మ ముడుగు నకర్మమర్మ మారయవలయుఁ
గర్మగతి యెన్న నతిగహన మా విజయ!

కర్మమ్మునం దెవఁ డకర్మముం గాంచును య
కర్మమున నెవ్వండు కర్మముం జూచునో
యతఁడు మతిమద్వర్యుఁ డతఁ డఖిలకర్మకరుఁ
డతఁడు యోగివతంసుఁ డగుఁ జూవె పార్థ!

తలఁపుఁ గోర్కియు లేక తా లోకసంగ్రహా
కలనఁ గర్మములెల్లఁ జేలుపుచుండెడువాఁడు
కర్మవని జ్ఞానశిఖిఁ గాల్చు పండితుఁ డంచు
ధర్మజ్ఞులగు బుధులు ధరణిఁ జెప్పుదురు.

ఫలకాంక్ష విడిచి నిచ్చలుఁ గడుం దనివిమై
నలరుచును నేయాశ్రయమును గోరని యతం
డొలసి కర్మములఁ జేయుచునున్న నేమియున్
వలసి చేయక యున్నవాఁడె యాఁ బార్థ!

తన యాత్మచిత్తములఁ దనలో నడఁచి యాస
గొన కెవ్వలనఁ బుచ్చికోలు పొంతను బోక
తనుధారణకు వలయు పనులనే చేయుచున్
మను నతఁడు పాపముం గనఁబోఁడు విజయ!

అలవోక నగు లాభములన తనియుచు ద్వంద్వ
ములకు లోపడ కొకప్పుడు మచ్చరము లేక
ఫలసిద్ధికలిమిలేముల నొక్కటిగ నెంచి
సలుపు నాతఁడు కర్మములఁ గట్టువడఁడు.

ఎల్లెడలఁ దగుల మొక్కింత లేక విముక్తి
నుల్లసిలి జ్ఞానసంయుక్తచిత్తముతోడ
జన్నమునకై చేయు చున్నతని కర్మమ్ము
లన్నియు విలీనమ్ము లైపోవుఁ బార్థ!

బ్రహ్మమే యర్పణము బ్రహ్మమె హవిస్సు మఱి
బ్రహ్మమే బ్రహ్మాగ్ని బ్రహ్మ వేల్చిన హుతము
బ్రహ్మకర్మసమాధిపరుఁ డొందఁ దగినదియు
బ్రహ్మమే సర్వమున్ బ్రహ్మమే విజయ!

యోగివర్యులు కొంద ఱాగమోచితదైవ
యాగమున్ విధియుక్తి నాచరింతురు భువిని
యజ్ఞమును బ్రహ్మాగ్నియజ్ఞమ్ముచేత నా
త్మజ్ఞు లగు వారు కొందఱు వేల్తు రనఘ!

నియమాగ్నులందు సంధించి శ్రోత్రాదికేం
ద్రియములం గొంద ఱర్మిలి వేల్చుచున్నారు
సర్వేంద్రియాగ్నులన్ శబ్దాదివిషయముల
నుర్విఁ గొందఱు వేల్చుచున్నారు పార్థ!

పూని యింద్రియకర్మములను ప్రాణానిలవి
తానకర్మములఁ గొందఱు యోగిపుంగవులు
జ్ఞానసందీపితం బౌ నాత్మసంయమా
నూనయోగాగ్నిలో నెగి వేల్చుచున్నారు.

యజ్ఞకలితవ్రతులు యతులు కొందఱు ద్రవ్య
యజ్ఞమును ఘనతపోయజ్ఞమును వరయోగ
యజ్ఞమును స్వాధ్యాయయజ్ఞమును సుజ్ఞాన
యజ్ఞమును వేర్వేఱ యజియింతు రనఘ!

నలి నపానమునఁ బ్రాణము వేల్చి పూరకము
నల యపానముఁ బ్రాణముల వేల్చి రేచకముఁ
గలయఁ బ్రాణాపానగతు లుడిపి కుంభకముఁ
జేలుపుచేను మఱి కొంద ఱిలను ప్రాణాయామ
కలనాభిరతులగుచు నలరుదురు విజయ!

పరిమితాహారులై పరఁగి కొందఱు యోగి
వరులు ప్రాణములందుఁ బ్రాణముల వేల్చెదరు
వీర లందఱు యజ్ఞవిదులు యజ్ఞక్రియా
దూరీకృతాశేషదుష్కృతులు పార్థ!

యజ్ఞశిష్టామృతము నారగించుచు నుండు
ప్రాజ్ఞులు సనాతనబ్రహ్మపద మొందుదురు

యజ్ఞదూరుల కీ యిహమ్మే లే దన నట్టి
యజ్ఞులకుఁ బరమపద మబ్బునే విజయ !

వేదముఖమున నివి భువిన్ వి_స్తరిల్లి
యిట్లు బహువిధయజ్ఞమ్ము లెసఁగుచుండు
సర్వయజ్ఞమ్ములును గర్మజములు సూవె
యింత యెఱిఁగిన మోక్షమ్ముఁ గాంతు వనఘ !

జ్ఞానయజ్ఞము ద్రవ్యమయయజ్ఞమ్ముకంటె మహాత్మ్యమం బగు
జ్ఞానమందుఁ దమంత విడివడి సర్వకర్మము లంతరించును
గురుల కెఱఁగియు నడిగియును మఱి కొలిచియును నది దెలిసికోఁదగు
ధరణి జ్ఞానముఁ దెల్పుదురు పరతత్త్వముం గనుఁగొన్న జ్ఞానులు
అట్టి జ్ఞానం బెఱిఁగి నీ వీఁక నిట్టి మోహము నొంద వెన్నఁడు
నెట్టుకొని నీలోన నాలో నిఖిలభూతము లరయ నేర్తువు
అఖిలపాపులకంటె నీవు మహాఘ మొనరుచు వాఁడ వైనను
నఖిలకలుషాంబుధిని జ్ఞానం బనెడు నావను దాఁటఁ జాలుదు
రగిలి బగబగ మండు నగ్గిని దగిలి కట్టెలు భస్మ మగు గతి
రగులు నా జ్ఞానాగ్నిఁ బడి కర్మమ్ము లన్నియు భస్మ మయ్యెడు
జ్ఞానమున కెన లేదు పావన మైన దంతకు నెదియు లే దా
జ్ఞానమును జిరకాలకృషిచే లోనెఱుఁగుఁ దా యోగసిద్ధుఁడు
జ్ఞాన మబ్బును దత్పరతఁ గడు శ్రద్ధ గల విజితేంద్రియున కా
జ్ఞాన మబ్బినయంత మోక్షానూనశాంతియు నపుడ యబ్బెడు
సంశయాత్ముఁడు నజ్ఞుఁడును విశ్వాసహీనుఁడు నాశ మొందును
సంశయాత్మున కిహపరమ్ములు శాంతిసౌఖ్యము లబ్బ వర్జున !

కాన యజ్ఞానమున మదిలోఁ
గలుగు నీ సంశయలతన్ స

న్మానితజ్ఞానాసిఁ గోసి య
మానివై నిష్కామయోగముఁ
బూని శోకము మాని సమరస
ముద్యమమునకు వేగ లే లె
మ్మా, నిజాన్వయధర్మ మియ్యది
యగుఁ జేమా వీరో త్తమా !

**అర్జునుఁడు:–** వాసుదేవా !

కర్మసన్యసనముఁ గర్మయోగమ్మను
నురవు లంచుఁ జెప్పుచున్నవాఁడ
విపుడు రెంట నొకటి యేది మేలో నిర్ణ
యించి నాకుఁ జెప్పవే మహాత్మ !

**కృష్ణుఁడు:–** ధనంజయా !

కర్మసన్యాసయోగ మ్మిదే దీని నీ
నిర్మలస్వాంతమున నెలకొల్పు మన్నా !
కర్మబంధమ్ములన్ ఖండించు నిష్కామ
కర్మయోగములోని మర్మముం దెలిసికొని
కర్మములఁ జేయుచుం గర్మసన్యాసివై
ధర్మసంగరదీక్ష దాల్పవే విజయా !

కర్మసన్యాస......

కర్మసన్యాసమ్ముఁ గర్మయోగము రెండుఁ
గైవల్యకరము లౌఁ గాని యారెంటిలోఁ
గర్మసన్యాసమ్ముకంటె నారసి చూడఁ
గర్మయోగమె కడుంగడు మేలు సుమ్మన్న

పగయుఁ గోర్కియు లేక తగుపనుల్ సేయువాఁ
డగు యోగి నిత్యసన్యాసి యని చెప్పుదురు
మిగులు ద్వంద్వములకుం దగుల కుండినవాఁడు
సుగముగా బంధముల తగులమ్ముఁ బెడఁబాయు
పరమార్థ మెఱుఁగని యపండితజనములు సాం
ఖ్యమ్ము యోగమ్ము వే ఱగు నంచుఁ బల్కుదురు
ఇరుదెఱఁగులం దొకటి యేదియైనను జేక్కఁ
జేలుపు వారికిఁ గల్గు ఫల మొకటె పార్థా!
కర్మసన్యాస......

సాంఖ్యజనములకు నే స్థాన మబ్బును యోగి
జనములకుఁ గూడ నా స్థానమే సమకూరు
సాంఖ్యమును యోగమును సరియగా నొకటిగా
నరయువాఁడే తత్త్వ మరయువాఁడు సుమన్న!
యోగసంగతి నొందకున్నచో సన్యాస
మత్యంతదుర్లభంబై యుండెడుం జూవె
యోగమును గొను కర్మయోగియా మునివర్యుఁ
డచిరకాలమున బ్రహ్మమ్ము నొందఁగ నేర్చు
వీతరాగుండు నిర్విజితేంద్రియాత్ముండు
పరిశుద్ధసత్త్వసంపన్నుండునై సర్వ
భూతజాతాత్మైకభూతాత్ముఁ డగు యోగి
కర్మబంధమ్ములం గట్టువడఁ డనఘా!
కర్మసన్యాస......

కనుచు వినుచేను మూరుకొనుచు నంటుచుఁ దినుచు
నిదురించుచేను జేనుచు నిట్టూర్పు విడుచుచేను

ననుచు విడుచుచుఁ గొనుచుఁ గనులు మూయుచుఁ దెఱచు
చింద్రియార్థమ్ములం దింద్రియములు చరించు
ననియుఁ దా నేమిఁ జేయని వాఁడ ననియుఁ బర
తత్త్వవిదుఁ డగు యోగి దలఁచుచుండఁగ వలయు
తలఁపున ఫలానుషక్తత వీడి కర్మముల
నీశ్వరార్పణముగా నెవఁ డాచరించునో
జలము నంటక యుండు జలజపత్రము వోలె
నాతండు పాపముల నంటఁ బోఁ డనఘా!
కర్మసన్యాస......

మమత వీడ్కొని నట్టి మనసుచే బుద్ధిచేఁ
దనువుచే నింద్రియోత్కరముచేఁ దగు లెడలి
సమతఁ గైకొని యాత్మసంశుద్ధికై కర్మ
మొనరించుచుండుదురు యోగిజనపుంగవులు
యోగసంకలనాభియుక్తుండు నిజకర్మ
ఫలము విడి నిష్ఠమైఁ బరమశాంతిని బొందు
యోగరహితుఁడు కామభోగలాలసమతిం
గర్మఫలసక్తుఁడై కట్టువడియెడుఁ జూవె
మనసుచే సర్వకర్మమ్ములన్ విడనాడి
తొమ్మిది ద్వారాలతోడిమైవీటిలో
ననుషక్తిఁ బనులఁ జేయకయుఁ జేయింపకయు
వశి దేహి యిమ్ములన్ వసియించు విజయా!
కర్మసన్యాస......

కర్మమ్ములం గాని కర్తృత్వముం గాని
కర్మఫలసంబంధకలనమ్మునుం గాని

నిర్మింపఁ డాప్రభువు నిఖిలలోకమ్మునకు
వర్తించేనది స్వభావ మ్మొక్కటియ చూవె
విజ్ఞానరూపుఁ డావిభుఁ డెవని దేనియును
గలుషమును సుకృతమును గైకొనం డెన్నఁడును
నజ్ఞానమున జ్ఞాన మావృతం బగుటచే
నఖిలజంతువులు మోహమ్ము నొందుచు నుండు
జ్ఞానమ్ముచేఁ దదజ్ఞాననాశముఁ జేసి
యలరారు నతినిర్మలాత్ము లగు వారి కా
జ్ఞానసూర్యుఁడు మోహసంతమస ముడిపి త
త్పరమార్థవస్తురూపముఁ జూపుఁ బార్థా!
కర్మసన్యాస......

తద్బుద్ధులును దదాత్మకులుఁ దన్నిష్ఠులును
దత్పరాయణులునై తనరారు పరతత్త్వ
సద్బోధనులు జ్ఞానసంచ్ఛిన్నపాపులై
యపునరావృత్తిపద మందఁగాఁ జాలుదురు
వినయవిద్యాయుక్తి విలసిల్లునట్టి బ్రా
హ్మణునియందును గోవునందు నేనుంగు నం
దును గుక్కయందు శ్వపచునియందు సమదృష్టిఁ
బరఁగు నాత్మజ్ఞులే పండితులు సుమ్మన్న!
సర్వసమబుద్ధితో జేరగువా రిహమందు
బ్రదికి యుండియ జన్మబంధమును బాయుదురు
సర్వసమమును నదోషము బ్రహ్మ మటుగాన
బ్రహ్మమయులై వారు పరఁగుదురు పార్థా!
కర్మసన్యాస......

నియతసుస్థిరబుద్ధి నిర్మోహచిత్తుండు
బ్రహ్మతత్త్వజ్ఞుండు బ్రహ్మమయుఁ డగుయోగి
ప్రియము సేకూరినం బ్రీతి గైకొనఁడు వి
ప్రియము సేకూరినన్ భీతిఁ గైకొనఁబోఁడు
బాహ్యవిషయముల సంపర్కమ్ము వీడ్కొన్న
బ్రహ్మయోగైకానుభవసముద్యుక్తాత్ముఁ
డూహ్యమ్ము గాని సద్యోగజాతాద్వితీ
యాక్షయాత్మానంద మంది శాంతిని బొందు.
కలితసంస్పర్శాదిఘనవిషయభోగములు
తుదకు విడుగర లేని దుఃఖమునె చేకూర్చుఁ
గలిగి యవి తొలఁగునవి గాని సతములు గావు
తజ్జుఁ డవ్వానియెడఁ దగులువడఁ డెన్నఁడును
మేను దొఱఁగక మున్న యే నరుం డిహమంద
ప్రబలకామక్రోధభవ మైన వేగమును
దా నాత్మలో నోర్చికో నేర్చి యుండునో
యతఁడె యోగియు సుఖియు నతఁడె చూ మ్మనఘా!
కర్మసన్యాస......

ఆత్మలో సుఖియించు చాత్మలోఁ గ్రీడించు
చాత్మలో వెలుఁగొందు చేలరుచుండెడు యోగి
యాత్మానుభవనిష్ఠుఁడై బ్రహ్మభూతుఁడై
బ్రహ్మనిర్వాణముం బ్రాపింపఁగా నేర్చు;
కొల లడఁచి ద్వంద్వములఁ గలత సెందక యింద్రి
యమ్ములన్ నిర్జించి యఖిలభూతహితాను
కలనాభిరతు లగుచు నలరెడు మహర్షులా
బ్రహ్మనిర్వాణముం బడయఁగాఁ జాలుదురు

మనసు లోఁగొనుచే నాత్మజ్ఞానము నెఱింగి
భూరికామక్రోధములకు లోపడకుండఁ
* జేను యతులకుం బ్రదుకుసావులందును గూడ
బ్రహ్మనిర్వాణమ్ము భాసిల్లు విజయా!
కర్మసన్న్యాస......

సీ. విషయసంపర్కమ్ము వెలికిఁ బోకడవెట్టి
బొమల నెన్నడుమఁ జూపును గదించి
నాసికాంతరమునన్ నడచు ప్రాణాపాన
పవనముల్ సమగతిం బరఁగఁ జేసి
యింద్రియమన ఆదు లెడ గాఁగ నియమించి
భయకోపవాంఛలం బాఱఁద్రోలి
మోక్షతత్పరుఁడైన మునిశేఖరుఁడు నిత్య
ముక్తుఁడ యగు నట్టి మోక్షశాలి

యతులయజ్ఞతపోభోక్త నఖిలభూత
హితకరుఁడ సర్వలోకమహేశ్వరుండ
నైన నన్ను నెఱింగి యత్యంతశాంతి
నధిగమించెదు భరతవంశాగ్రగణ్య!

ఇంతయును జేక నీ స్వాంతమున నెలకొల్పి
పంత విడి జ్ఞానభాస్వంతుచే సమ్మోహ
సంతమస ముడిపి యత్యంతశాంతిని బొంది
పంత మేపార దుర్దాంతకులధర్మమును
సంతరింపవె ఫల్గునా!

* మన నేర్చు యతులకుం బ్రదుకుసావుల యందుఁ

ఫలముం గోరక కర్తవ్యము లగు
పనుల నసక్తతఁ జేసెడు నతఁడే
యల సన్యాసియు యోగియు నగుఁ గాఁ
డగ్నులు క్రియలు దొలంగిన యాతఁడు

సన్యాసం బనునదె యోగం బని
సజ్జను లందురు సంకల్పమ్మును
సన్యసింపఁగాఁ జాలని యాతఁడు
జగతి యోగి గాఁజాలఁడు సూవే

యోగము నధిరోహింపఁగఁ గోరెడు
యోగికిఁ గర్మమె సాధన మందురు
యోగారూఢుం డయి యొప్పారెడు
యోగికి శమమే సాధన మందురు

కలగొను నింద్రియవిషయములందును
గర్మములందుఁ బ్రసక్తిని వీడ్కొని
తలఁపుల నెల్లఁ దనంతఁ దొలంగు న
తండే యోగారూఢుం డందురు

ఆత్మనె యాత్మ సముద్ధరింపవలె
నాత్మ నధోగతి పాల్పఱుపం జేన
దాత్మయ యాత్మకు బంధువు మఱి యా
త్మయె యాత్మకు శత్రువు సుమ్మా!

ఆత్మసంయమనయోగం బిది నీ
యాత్మను దీనిఁ దిరంబుగ నిడికొని
యాత్మజ్ఞుఁడవై నీ కులధర్మం
బాచరింపు మన్నా!

ఀ ఆత్మకు నాత్మ వశీకృత మగు నే
నది తనకుం దాఁ జోట్టం బయ్యెడు
♦ నాత్మకు నాత్మ యవశ్యం బగు నే
నది తనకుం దా శత్రువ యయ్యెడు
శమియై గౌరవపరిభవములకుం
జలికాఁకల నగు సుఖదుఃఖములకు
సముఁడై విజితాత్మకుఁ డగు శాంతుఁడు
సాక్షాత్పరమాత్ముని దర్శించెడు
విజ్ఞానజ్ఞానాతితృప్తమతి
విజితేంద్రియుఁడును గూటస్థుండును
బ్రాజ్ఞుఁడునై పైఁడియు మట్టియు నొక
భంగిఁ దలంచెడు యోగియె యుక్తుఁడు
సుహృదులఁ జెలుల నుదాసీనుల మఱిఁ
జోట్టమ్ముల మధ్యస్థుల ద్వేష్యుల
నహితుల సాధులఁ బాపుల నొకగతి
నరసెడు యోగి తరించెడు విజయా!
ఆత్మసంయమన......

ఆత్మవిద్య యిది యాత్మబోధ మిది
యాత్మతత్త్వ మిది యాత్మోదయ మిది
యాత్మానందముఁ గోరు వారి కిది
యాచరణీయము సూవే పార్థా!
రాగము ద్వేషము భీతియుఁ దొఱఁగి ని
రాశుం డగుచుఁ బరిగ్రహ మొల్లక

ఀ ఆత్మచేతమ్మున నిగ్రహింపంబడు నాత్మ తదాత్మకుఁ జోట్టం బయ్యెడు.
♦ ఆత్మచేతన గెలువం బడకుండిన యాత్మ తదాత్మకు శత్రువ యయ్యెడు.

భోగము లుడిగి మనోదేహేంద్రియ
ములవశ మొనరిచి బ్రహ్మచారియై
యోగి ప్రశాంతత నేకాంతమ్మున
నొంటరిగాఁ బరిశుద్ధస్థలి దీ
ర్ఘాగతిఁ గొని మన మేకాగ్రత నిడి
కడు నెత్తును గడు దిగుడును గా కొగి
బాగుగ దర్భలు చర్మము చేలము
పఱచిన యాసన మమరిచి యట స
ద్యోగోన్ముఖుఁ డయి కూరుచుండి తల
యును మెడయును మేనును నచలోన్నత
మౌ గతి సరిగా నిలుపుచు నలుదెస
లవలోకింపక చూడ్కి ముక్కు తుద
పైఁ గదియించి యతిస్థిరుఁడై మ
త్పరుఁడై చిత్తము నాయం దిడికొని
యోగాభ్యాసం బాత్మశుద్ధికయి
యొనరించినచో మదధీనం బగు
సౌగతికోన్నతనిర్వాణస్థిర
శాంతిని బొందెదుఁ జూవే పార్థా!
ఆత్మసంయమన.....

తిండిపోతయిన వానికి నేమియుఁ
దిన కుపవాసముఁ జేసెడు వానికి
మెండుగ నిదురించెడు వానికిఁ గడు
మేల్కని జాగర మొనరుచు వానికిఁ
బండదు యోగము మితభోజనుఁ డయి
పరిమితనిద్రుం డయి వినియతకర

ర్మం డగు వానికె భవదుఃఖాపహా
మోక్షదయోగము చేపడుఁ జూవే
యెప్పుడు చిత్తము వశమయి యాత్మనె
యెల్లకోరికల వీడ్కొని యుండునో
యప్పుడ తృష్ణఁ దొలంగిన యన్నియ
తాత్ముఁడు యుక్తుం డని చెప్పంబడు
గాలికేని యెదఁ గదలక వెలుఁగుచుఁ
గ్రాలెడు దీపము పోలికఁ జిత్తము
నోలి సమాధిని గదలక నిలిపెడు
యోగి వెలింగెడుఁ జూవే పార్థా!
ఆత్మసంయమన......

ఎందు నాత్మనిష్ఠాపరతం జలి
యింపక చిత్తము శాంతిం గనునో
యెందు నాత్మచేఁ బరమాత్మం గను
చెప్పుడు నాత్మం దనివి సెందునో
యెందు ననంతము బుద్ధిగ్రాహ్య మ
తీంద్రియ మగు సుఖ మెఱుఁగంబడునో
యెందుఁ దిరంబుగ నెలకొని యున్న నె
కింత తత్త్వమునఁ జలన మొదవదో
దేనిం బొంది మఱొండు లాభ మది
దీనికి నధికము గా దనుకొనునో
దేనిం గాంచిన నెంతటి దుఃఖ
స్థితియుఁ జలింపఁగఁ జేయఁజాలదో
దానిని దుఃఖవియుక్తతనే సము
దంచితయోగం బని తెలియం దగుఁ

బూనికచే విసువని చిత్తముచేఁ
బొందఁగ నగు నా యోగము పార్థా !
ఆత్మసంయమన......

తలఁపునఁ బొడమెడు నెల్లకోరికలఁ
దలఁగి మనమ్మున నింద్రియసంతతిఁ
గలయఁగ లోఁగొని ధృతిఁ జేపడిన య
కల్మషబుద్ధిబలమ్మున మనసును
మెలపున నాత్మన నెలవుకొలిపి మెల
మెల్లఁగ నుపరమ మొందఁ జేయఁగా
వలయు నొకింతయుఁ దలఁపఁగ రా ద
వ్వలనన్ నిలువక యస్థిరమును జం
చలమును నగు మన మేయే వలనికిఁ
జేనునో యాయా విషయాంతరముల
వలనన్ మరలిచి దాని నిజాత్మన
వసపడి నిలిచెడు నట్లు చేయఁగా
వలె నిమ్మాడ్కిని సతతము యోగా
భ్యాసముఁ జేసెడు యోగివరుఁడు ని
ష్కలుషుఁడు శాంతరజస్కుఁడు శాంత
స్వాంతుఁడు జీవన్ముక్తుఁడు నై ని
ర్మలతర ముత్తమ మతుల మనంతము
బ్రహ్మస్పర్శసముద్భూతమునై
పొలిచెడు సుఖము ననాయాసముగాఁ
బొంది తరించెడుఁ జూవే పార్థా !
ఆత్మసంయమన......

సర్వభూతసంఘాతములందును
సమదర్శనుఁడౌ యోగయుతాత్ముఁడు
సర్వభూతములలోఁ దనుఁ దనలో
సర్వభూతములఁ జూచెడు ననఘా!
నను నఖిలమ్మునయందును జూచుచు
నాయం దఖిలమ్మును జూచెడు నా
తని కే నగపడకుండను నాకు న
తండును నగపడకుండఁడు సుమ్మా!
అవిభేదస్థితిఁ గొని యఖిలస్థితుఁ
డగు ననుఁ గొలిచెడు యోగి యే గతిని
నవనిఁ జరించినఁ గాని యతఁడు నా
యందే యుండెడు వాఁ డగుఁ జూవే
సుకము గాని మఱి దుఃఖము గానీ
చొప్పడు నప్పుడు తనకున్ సరిగా
సకలభూతముల నరసెడు యోగియె
సర్వోత్తముఁ డగుఁ జేమ్మా పార్థా!
ఆత్మసంయమన.....

అర్జునుఁడు:—

వనజాక్ష! యిట నీవు వాక్రుచ్చి నట్టి
వరసామ్యయోగమ్ము వశము గా దంచు
ననుకొందు బహుచలం బగు మదిన్ దీని
ననయమ్ముఁ దిరము సేయఁగ రాదు గాదె
మనసు చంచలమున్ బ్రమాథియున్ దృఢము
మనుజు బల్మిఁ గలంచి మరలింప రాక

యనుపదమ్మునను ద్రిప్పు ననిలముం బోలె
నద్దాని నరికట్ట నగునయ్య! చెపుమ.

కృష్ణుఁడు:—

ఔ నవును పార్థ! నీ వన్నయట్లు మనము
నిగ్రహింపఁగ రాని దాని నిజేము గాని
ప్రబలవైరాగ్యమున సదాభ్యాసమునను
నమ్మనము నిగ్రహింపఁగా నగుఁ జేమయ్య!

అనియతాత్మకునకు నమ్మహాయోగమ్ము
పొంద రాని దంచు బుద్ధిఁ దలఁతు
వశ్యచిత్తుఁ డైనవాఁడు చేకూఁ గడంగి
వెరవుమెయిని దానిఁ బొరయఁ గలఁడు.

అర్జునుఁడు:—

శ్రద్ధ గలిగి కడఁక చాలమిం దుదివేళ
మదికి యోగచలన మొదవు కతన
యోగసిద్ధి నొందకున్న వాఁ డే గతిం
గాంచు నాకుఁ జెప్పఁగదవె కృష్ణ!

మోహవశత బ్రహ్మమును బొందు తెరువేది
యాశ్రయమ్ము లేనియట్టి యోగి
గాలిఁ జెదరు మొయిలుగతి నిందు నందునం
గాక వితగఁ జెడఁడుగా మహాత్మ!

ఇందుఁ గృష్ణ! నాదు సందేహ మది యెల్లఁ
దలఁగఁ జేయ నీవ తగుదు సూవె

నిఖిలవిదుఁడ వైనన్ నీకంటె నిట్టి సం
దియము నెరుఁ దెవండున్ దీర్పఁ గలఁడు!

కృష్ణుఁడు:—

పార్థ! యోగాభ్యాసపరున కిందును గాని
యందుఁ గాని వినాశ మొందఁబో దెపుడుఁ
గళ్యాణకరుఁడు దుర్గతి నొందునే తండ్రి!
యిందు నీ కావంత సందియము వలదు
అవని యోగభ్రష్టుఁ డగు యోగి పుణ్యలో
కము లొంది వివిధభోగములఁ బెక్కేఁడు
లనుభవించి పవిత్రు లైనట్టి శ్రీమంతు
లింటఁ దా మగుడ జనియించెడుం బార్థ!
అటు గాక ధీమంతు లగు యోగిపుంగవుల
సత్కులమునం దయిన జననమ్ము నొందు
నిటువంటి పుట్టు వీ యిహలోకమునయందు
నత్యంతదుర్లభం బగుఁ జేమీ విజయ!
అట్లు యోగికులమ్మునందుఁ బుట్టి యతండు
తన తొంటి పుట్టు వందలి బుద్ధి వడసి
దానఁ గ్రమ్మఱఁ బూని తద్యోగసిద్ధికై
కౌంతేయ! జేతనమ్ముఁ గావించుఁ జేవె
అవశాత్మకుం డయ్యు నాతఁ డా తన తొంటి
యలవాటు బల్మి విషయములఁ బొల్పడఁడు
యోగైకజిజ్ఞాస నొంది తద్వేదోక్త
కర్మఫలసంసక్తిఁ గడచి వర్తించు

అత్యంతయత్నమ్ము నాచరించెడు యోగి
పాపమ్ములం బాసి పరిశుద్ధి నొంది
బహుజన్మసిద్ధుఁడై బ్రహ్మతత్త్వ మెఱింగి
పరమగతి నొందెడున్ భరతకులముఖ్య!

అనఘ! తపసులకంటె నధికుఁడౌ యోగి
అవని జ్ఞానులకంటె నధికుఁడౌ యోగి
అతులకర్మలకంటె నధికుఁడౌ యోగి
అటు గాన యోగి వీ వగు మయ్య పార్థ!

శ్రద్ధ గలిగి మనసు సతతమ్ము నాయందు
నునిచి నన్నుఁ గొలుచు చుండు నతఁడు
జగతి సకలయోగి జనులలో నుత్తమో
త్తముఁ డటంచు నేను దలఁతు విజయ!

నన్ను నాశ్రయించి నాయందు మన నుంచి
యోగ మాచరించు చుండు నీవు
సందియములఁ బాసి చక్కన న న్నెఱుఁగు న
వ్విధముఁ దెలియఁబఱుతు వినుము పార్థ!

మానితవిజ్ఞానముతోఁ గూడిన
జ్ఞానం బియ్యది దీనిఁ దెలిసికొని
నీ నృపవంశోచితధర్మమ్మును
నిర్వహింపు మన్నా!
ఈ నిర్మలవిజ్ఞానయోగమును
బూని యంతయును బుద్ధి నెఱింగిన

మానవునకు నిటఁ దెలియ వలసినది
మఱి యిం కేదియు మిగులదు విజయా!
మానితవిజ్ఞానములో......

పెక్కువేల మనుజులలో నెవఁడో
యొక్కఁడు సిద్ధికి జేతన మొనర్చెడు
నొక్కట నా సిద్ధులలో నెవఁడో
యొకఁడు తత్త్వగతి నన్ను నెఱింగెడు
అనఘ! పుడమి నీ రగ్గియు గాలి గ
గనమును మనసును బుద్ధి యహంకృతి
యను నీ యెనిమిది గతుల నా ప్రకృతి
యంతటఁ గీల్కొని వేర్పడి యున్నది
ఇయ్యది యపర యనం జేను ప్రకృతి మ
ఱింకొక ప్రకృతియుఁ బర యనునది గల
దయ్యది యంతర్జీవాత్మిక యై
యఖిలజగమ్ముల ధరించుచు నున్నది
ఈ నా ప్రకృతులు సర్వభూతగణ
హేతువు లంచు నెఱుంగుము దీనన
యేను జగమ్ముల నెల్ల సృజించి ల
యింపఁగఁ జేసెడి కారణ మైతిని—
ఒండు కారణము నాకంటెను మఱి
యొక్కటి లే దిట దారమునన్ మణు
లుండెడు పోలిక నాయం దీ భువ
నోత్కర మున్నది సూవే పార్థా!
మానితవిజ్ఞానములో......

నేన జలమ్ముల యందలి రసమను
నేన రవీందుల యందలి దీప్తిని
నేన వేదముల యందలి ప్రణవమ
నేన యాకసము నందలి శబ్దమ
నేనే నరు లందలి పౌరుషమను
నేనే భువి యందలి నెత్తావిని
నేనే పావకు నందలి తేజమ
నేనే భూతమ్ముల జీవనమను
నేనే తపసుల యందలి తపమను
నేనే భూతములకు బీజమ్మను
నేనే మతిమంతుల బుద్ధిని మఱి
నేనే తేజస్వుల తేజంబను
గామరాగపరివర్జితమగు ను
త్కటబలశాలుల బలమను నేనే
భూమధర్మసమ్మతమై యెసఁగెడు
భూతము లందలి కామమ నేనే
ఫల్గున ! సాత్త్వికరాజసతామస
భావము లన్నియు నా కతమననే
కల్గెడు వానికి నే వశవర్తిని
గా నవి నాకు వశమ్ములు సుమ్మా !
మానితవిజ్ఞానముతో ......

అన్నిట నీ జగ మంతయు నీ త్రిగు
ణాత్మకభావమ్ముల మోహితమై
యున్న కతమ్మున వీనికిఁ బరుఁ డగు
నన్ను నవ్యయుని నెఱుఁగం జాలదు

అన్నా ! గుణమయి దైవి మోహినియు
నగు నామాయ తరింపఁగ రానిది
నన్నే శరణముఁ బొందెడు వా రీ
నాదగు మాయను దాటఁగ నేర్తురు
పాపులు మూఢులు నగు నరాధములు
పైకొని మాయ ననుం గను నెఱుకం
బాపఁగ నాసురభావముఁ గొని నను
బత్తిని శరణముఁ బొందఁగ నేరరు
జగతిని నార్తుఁడు నర్థార్థియు జి
జ్ఞాసువు జ్ఞానియు ననియెడు నీ నా
లుగు దెఱఁగుల వారగు సుకృతాత్మకు
లున్ నను బత్తి భజించుచు నుందురు
నిత్యయోగి యయి యేకభక్తుఁ డయి
నెగడెడు జ్ఞానియె వారలలోఁ ఘనుఁ
డత్యంతము నేఁ బ్రియుఁడను జ్ఞానికి
నతఁడును నాకును నెంతయుఁ బ్రియుఁడగు
వా రందఱును నుదారులె యగుదురు
వారలలో యుక్తాత్మకుఁ డై ని
స్తారకనుగతిగ నన్నే పొందెడు
జ్ఞాని మదాత్మయె యని నే నెంచెద
జ్ఞానవంతుఁ డల వాసుదేవుఁడే
సర్వము నని బహుజన్మమ్ముల తుదఁ
దా ననుఁ బొందెడు నట్టి మహాత్ముఁడు
ధర దుర్లభుఁడు గదన్నా ! పార్థా!
మానితవిజ్ఞానములో . . . .

కొందఱు ప్రకృతికి లోనై యాయా
    కోర్కులచే నజ్ఞానమునం బడి
యందం దాయా నియమమ్ములం గొని
    యన్యదేవతలం గొల్చుచు నుందురు
ఏయే భక్తుం డేయే తనువు ని
    జేచ్ఛ శ్రద్ధ నర్చింపంగం బూనునొ
యాయా కామికి నా శ్రద్ధను నే
    నందుం దిరం బొనరించుచు నుందుదు
అతం డా శ్రద్ధం గైకొని బత్తిని
    నా దేవత నారాధించుచు నా
కతనన యొదవిన కాంక్షితఫలములం
    గాంచి మనమ్మునం దనియుచు నుండును
అల్పబుద్ధు లగు వారికిం దత్ఫల
    మస్థిర మయ్యెడు దేవార్చకు లా
యల్పులు తద్దేవతలం బొందుదు
    రస్మద్భక్తులు నన్నుం జెందుదురు
అవ్యయ మతుల మనుత్తమ మగు నా
    యప్పరభావ మెఱుంగంగం జాలక
యవ్యక్తుని నను వ్యక్తరూపునిగ
    నాత్మం దలంతురు బుద్ధివిహీనులు
యోగమాయచేం బరివృతుండ నగు నే
    నొరుల కగోచరుండై యుండుదు ని
ర్యోగులు మూఢులు నగు లోకులు శ్రీ
    యుతు నజు నవ్యయు నన్ను నెఱుంగరు
పొడమి యడంగినవి పొడముచు నున్నవి
    పొడమం గలయవి యగు భూతమ్ములం

గడుఁ దెల్లంబుగ నే నెఱుఁగుదు నె
క్కండును నన్ను నెఱుంగఁడు పార్థా!
మానితవిజ్ఞానముతో......

పుట్టిన యప్పుడ యిచ్ఛాద్వేషస
ముత్పన్నం బగు ద్వంద్వమోహమునఁ
గట్టువడిన యీ సర్వభూతములు
గడు సమ్మోహము పొల్పడుచుండును
పూర్వజన్మసంచితపాపమ్మును
బోకడవెట్టిన పుణ్యకర్ము లీ
యుర్విని ద్వంద్వవిమోహవిముక్తత
నొంది దృఢవ్రతులై ననుఁ గొల్తురు
అజరామరణస్థితిఁ బొందఁగ న
న్నాశ్రయించి యత్నించెడు సజ్జను
లజ మగు బ్రహ్మము నఖిలాధ్యాత్మము
నఖిలకర్మమును నెఱిఁగి తరింతురు
అధిభూతముతో నధిదైవముతో
నధియజ్ఞముతోఁ గూడిన నన్నున్
విధిగ నెఱుఁగు యుక్తాత్ములు ననుఁ దుది
వేళను నెఱుఁగుదు రన్నా! పార్థా!
మానితవిజ్ఞానముతో......

అర్జునుఁడు:—

అనఘాత్మ! తద్బ్రహ్మ మన నేమి? యధ్యాత్మ
మన నేమి? మఱి కర్మ మనఁగ నేమయ్యా?
అధిభూత మన నేమి? యధిదైవ మన నేమి?
మధువైరి! యిమ్మేన నధియజ్ఞుఁ డెవఁడు?

మరణవేళను నియతమానసులు నిన్నెట్టు
లెఱుఁగ నేర్తురు నాకు నెఱిఁగింపు మయ్య!

**కృష్ణుఁడు:—**

సీ. పరమ మైనట్టి యక్షరమ తద్బ్రహ్మమ్ము
తత్స్వభావంబ యధ్యాత్మ మనఁగ
భూతభావోద్భూతికిఁ హేతువై యొప్పారు
నవ్విసర్గమ కర్మ మనఁగఁ బరఁగు
నధిభూత మన క్షరంబగు భావ మధిదైవ
మనఁగఁ దత్పూరుషుం డగుఁ జేమయ్య!
యీ శరీరమ్మునం దేపారు నధియజ్ఞుఁ
డెవ్వఁడో యనుకొనకు మేన చూవె

మరణవేళ నన్నె మనసులోఁ దలఁచుచున్
మేను విడిచి పోవు మానవుండు
నాదు భావ మొందుఁ లేదు సందియ మిందు
నాత్మ దీని నిల్పు మన్న! పార్థ!

ఏయే భావము నెవఁడు దలంచుచుఁ
గాయము విడుచునో కడవేళ నతం
డాయా భావము నందెడుఁ దత్తత్
స్వీయభావనాసిద్ధిని బార్థా!

కావునన్ నీ వెల్లవేళలఁ గడఁక ననుఁ దలపోయుచున్ స
ద్భావమున నాయందు నీ చిత్తమును బుద్ధియు నిలుపుకొని నీ
పావనాన్వయధర్మ మగు నీ ప్రథనకర్మ మొనర్పుమా చిం
తావియుక్తిం జెంది తప్పక నన్నె పొందుదు వర్జునా!

సీ. కవిని సర్వవిధాత నవిచింత్యరూపుని
ననుశాసకుని జిరంతను ననంతు
నాదిత్యవర్ణుఁ దమోఽతీతు దివ్యుని
నణువులోఁ బరమాణువైన వాని
జగదుద్భవస్థితిసంహారకారణు
భక్తలోకాధీనుఁ బరమపురుషు
నభ్యాసయోగయుక్తానన్యగతభక్తి
సంయుతస్థిరమానసమున నునిచి

యోగబలమునఁ బ్రాణమ్ము నూర్ధ్వగతముఁ
జేలిపి బొమల నెన్నడుమఁ గీల్కొలిపి నిలిపి
మరణకాలమ్మునందు సంస్మరణ సేయు
నరుఁడు దప్పక యప్పరాత్పరునిఁ బొందు.

అక్షరం బని వేదజ్ఞు లన్న పదము
యతులు సిద్ధినిఁ గనిచొచ్చినట్టి పదము
బ్రహ్మచర్యపరులు గోరు భవ్యపదము
వినుతు సంగ్రహముగ నీకు వినుము విజయ !

ద్వారమ్ము లన్నియున్ బంధించి హృదయాంబు
జమునందు మనసు నిశ్చలముగా నిలిపి
మూర్ధమ్మునం బ్రాణమును జేర్చి నెలకొల్పి
పటుయోగధారణాపరత మైకొనుచు
నల బ్రహ్మమైన 'ఓం' మ్మనెడు నేకాక్షరం
బుచ్చరించుచు నన్ను నోగిఁ దలంచుచును
గడవేళ నెమ్మేను విడిచిపోయెడు వాఁడు
పరమమా సద్గతిం బ్రాపించుఁ బార్థ !

నిత్యమును నాయంద చిత్తము
నిలిపి సతతము నన్ స్మరించుచు
నిత్యయుక్తుం డైన యోగికి
నేను సులభుండ నర్జునా!
పరమసిద్ధిని గను మహాత్ములు
పరుని నన్నుం బొంది దుఃఖా
కర మశాశ్వత మైన సంసృతి
మరలఁ బుట్టరు భారతా!
బ్రహ్మలోకము మొదలు పునరా
వర్తు లీ లోకములు నాదగు
బ్రహ్మపద మొక్కటియె యపున
ర్జన్మపద మగు ఫల్గునా!
వేయి యుగములు పగలు బ్రహ్మకు
వేయి యుగములు మఱియు నతనికి
రేయి యిటు లిరువేయి యుగములు
రేవగ ళ్లగుఁ బాండవా!
వ్యక్తు లన్నియుఁ బొడము నా య
వ్యక్తమున దివసాగమమ్మున
వ్యక్తు లన్నియు నడఁగు నా య
వ్యక్తమున నిశి నర్జునా!

బడిని నాయీ భూతజాతమె
పగలు రా మఱి రేయి రాఁగా
నుడుగ కెపుడును సారెసారెకుఁ
బొడమి యడఁగుచు నుండెడున్.

అనఘ! యా యవ్యక్తమే కా
కక్షరబ్రహ్మము మ యొక్కటి
దనరు నది సర్వము నశించినఁ
దా నశింపక భాసిలున్
అక్షరం బవ్యక్త మది పర
మైన గతి యది తిరిగిరా ర
య్యక్షయోన్నతగతికిఁ జేను వా
రదియ మత్పద మర్జునా!
పరమపురుషుఁ డతండు నిశ్చల
భక్తిగమ్యుఁడు భూతధారణ
నిరతుఁ డాతం డెపుడు నంతట
నిండి యుండెడుఁ బాండవా!

రాకపోక లుడుపుకొ రమణీయకాలమ్ము
రాకపోక లుడుపకొరాని కాల
మిందు యోగిజనులుకొ పొందు చందము నీకు
సరిగ వినుతు వినవె భరతముఖ్య!

సీ. అగ్గి జ్యోతియు దినంబొ బల శుక్లపక్షమ్ము
నార్నెలల్ గల యుత్తరాయణమ్ము
నను వీనిలోన మేనిని బాసి చేను బ్రహ్మ
విదులు బ్రహ్మమ్ము నెంకొదెదరు సూవె
యిట్లు ధూమమ్ము రేయియుఁ గృష్ణపక్షమ్ము
నార్నెలల్ గల దక్షిణాయనమ్ము
నను వీనిలో మృతింకొ గను యోగి యైందవ
జ్యోతి నొందుచుఁ బుట్టుకొచుండుఁ జూవె

శాశ్వతమ్ము లగుచున్ జగతి నెల్లపుడు నీ
తెలుపు నలుపు గతులున్ నిలిచి యుండు
నొకట రాకపోకన్ లుడుగుఁ దద్గతుల కిం
కొకట రాకపోకన్ లొదవుఁ బార్థ!

ఈ గతుల నెఱుంగున్ యోగివర్యుఁడు నిత్య
యుక్తుఁ డగుచు మోహాన్ మొందఁ బోఁడు
కాన నీవు సర్వన్ కాలమ్ములందును
నతులయోగయుక్తుఁన్ డగుము విజయ!

వేదయజ్ఞతపోదానన్ విధులవలని
వితతపుణ్యఫల మ్మెల్లన్ నతకరించి
యిమ్మహార్థమ్ము సర్వమ్మున్ నెఱిఁగి యోగి
యాద్య మగు తత్పరంధామన్ మందుఁ బార్థ!

విజ్ఞానాన్విత మతిగోప్యం బీ
సుజ్ఞానం బిది నీ వెఱిఁగినచో
నజ్ఞానమ్మును బాసి మోక్షసుఖ
మనుభవింతు వన్నా!

రాజవిద్య యిది రాజగుహ్య మిది
రమ్యధర్మ మిది సాక్షాత్ఫల మిది
రాజిత మవ్యయ ముత్తమ మిది సుక
రం బిది పావన మియ్యది పార్థా!
విజ్ఞానాన్విత......

ఇందలి ధర్మమునందును శ్రద్ధ వ
హింపక మెలఁగెడు మూఢులు నన్నుం

బొందఁగ నేరక సంసృతి పాల్పడి
పుట్టుసావులకు లోనై యుందురు
ఆతతమై యున్నది యేతజ్జగ
మంతయు నా యవ్యక్తమూర్తిచే
భూతము లన్నియు నాయం దున్నవి
భూతములం దే లేను జెమన్నా !
నాయం దీ భూతమ్ములు లే వీ
నా యైశ్వర మగు యోగముఁ జూడుము
నా యాత్మయ భూతముల సృజించి య
ణంచెదు భూతస్థము గా దదియును
మానక నిత్యము వాయువు నింగిని
మలయుచే నుండెడు చేందమ్మున నీ
నానాభూతము లన్నియు నెప్పుడు
నాయం దున్నవి సూవే పార్థా !
విజ్ఞానాన్విత....

కల్పక్షయమున సర్వభూతసం
ఘాతము నాదగు ప్రకృతిం బొందును
గల్పాదిని నా భూతచయమ్ములఁ
గ్రమ్మఱ నేను సృజించుచే నుందును
ప్రకృతివశత నవశ మ్మగు భూత
ప్రకరము నెల్ల స్వకీయమైన యా
ప్రకృతిని లోఁగొని సారెసారెకును
బ్రతికల్పముఁ బుట్టించుచు నుండుదు
సర్గస్థితిలయకర్త నయ్యు నవి
షక్తత నేను దటస్థుఁడ నగుటన్

సర్గస్థితిలయవిషయకకర్మో
చ్చయము ల వెవ్వియు నను బంధింపవు
సాక్షి నయిన నాచేతం బ్రకృతి చ
రాచర మెల్ల సృజించెడు నాయ
ధ్యక్షసాక్షితాబలముననే జగ
మంతయు నడచెడుఁ జూవే పార్థా!
విజ్ఞానాన్విత......

వ్యర్థాశలు మఱి వ్యర్థకర్మలును
వ్యర్థజ్ఞానులు నగు మూఢులు కా
మ్యార్థాసక్తిని రాక్షసి మోహిని
యాసురియును నగు ప్రకృతిం గొని య
త్యర్థము భూతమహేశ్వర మగు నా
తత్త్వ మెఱుంగక లోకధర్మర
తార్థము మానుషతనువుం గొను నను
ననయము నవమానించుచు నుందురు.

అవ్యయుండు భూతాదికారణుం
డని నను నెఱిఁగి యనన్యచిత్తులై
దివ్యప్రకృతిం జెంది మహాత్ములు
ధీరులు నన్ను భజించుచు నుందురు.

నిత్యయుక్తు లగు భక్తులు సువ్రత
నిష్ఠను మ్రొక్కుచు సంకీర్తించుచుఁ
బ్రత్యహమున్ శుభయత్నసక్తు లయి
భక్తిని నను సేవించుచు నుందురు.

కొందఱు గొల్తురు జ్ఞానయజ్ఞమునఁ
గొంద ఱేకతన్ వివిధాకృతిగాఁ
గొందఱు మఱియును సర్వతోముఖతఁ
గొందఱు నన్నుం గొల్తురు పార్థా!
విజ్ఞానాన్విత......

•

నేనే క్రతువను నేనే యజ్ఞము
నేన స్వధను నౌషధమను నేనే
నేనే మంత్రమ నేనే యాజ్యము
నేనే యగ్నిని హుతమను నేనే
నేనే జగతికిఁ దల్లిని దండ్రిని
నేనే ధాతను దాతను నేనే
నేనే వేద్యము నోంకారము నే
నే ఋక్సామయజుస్సులు నేనే
ప్రభువును గతియు సుహృత్తును సాక్షియు
భర్తయు వాసము శరణము నేనే
ప్రభవము నవ్యయబీజము నిధియును
ప్రళయంబును స్థానంబును నేనే
నేన తపింపఁగఁ జేయుదు నేనే
వానల నుడుపుదుఁ గురియుదు నేనే
నేనే మృత్యువ నమృతంబను నే
నే సదసత్తులు నేనే పార్థా!
విజ్ఞానాన్విత.....

శ్రుతివేత్తలు యజ్ఞముల యజించుచు
సోమపానముం జేసి పూతదు

మఖకృతు లయి స్వర్గతిఁ గాంక్షించుచు దే
వేంద్రలోకముం బొంది యందు నా
యతనానావిధదివ్యభోగముల
ననుభవించుచును క్షీణపుణ్యులై
క్షితికిం గ్రమ్మఱ వచ్చుచుందు రిటు
శ్రుతిచోదితధర్మాచరణస్థితి
రతమతు లగు కామ్యార్థగులు సతతము
రాకపోకలం జేయుచు నుందురు

భక్తి ననన్యమనస్కత నను స
ద్భావనఁ గొల్చెడు నిత్యయోగసం
యుక్తాత్మకు లగు మత్పదభక్తుల
యోగక్షేమము నేన వహించెద

అన్యదేవతల శ్రద్ధాభక్తుల
యజియించెదు వా రఖిలదేవతా
నన్యాత్ముఁడ నగు నన్నె యజించెద
ర ట్లయ్యును వా రయ్యది యెఱుఁగరు

అవని సర్వయజ్ఞములకు భోక్తను
నధిపుఁడ నేనే యని వా రెఱుఁగమి
నవిధిపూర్వకముగా యజియించుట
నమ్ముఖఫలములు వారిం జెందవు
దేవార్చకు లా దేవతలం బిత్రు
దేవార్చకు లా పితరుల భూతే
జ్యావకు లా భూతముల ననున్ మ
ద్యాజులు పొందుదు రన్నా! పార్థా!

విజ్ఞానాన్విత......

ఫలమో జలమో పత్రమొ పుష్పమొ
బత్తిని నా కర్పించినచోఁ ద
త్సలలితభక్తిసమర్పిత మంతయుఁ
దప్పక నేఁ గయికొందుఁ జేమన్నా!
ఏది చేయుదువో యేది తిందువో
యేది యజింతువో యేది యిత్తువో
యేది తపింతువో నీ వది యంతయు
నెంతయు బత్తిని నా కర్పింపుము
గాసిం బడ కిటు చేసినచో నీ
కర్మబంధముల నెల్లఁ బాసి స
న్న్యాసయోగయుక్తిని ముక్తుఁడవై
నన్నుఁ బొందెదవు సుమ్మా! పార్థా!
విజ్ఞానాన్విత.....

అన్నిట నే సముఁడను నా కప్రియుఁ
డని మఱి ప్రియుఁ డని యుండఁ డొకండును
నన్ను బత్తిఁ గొల్చెడు వా రుందురు
నాయం దే వారలయం దుండుదు
నెంత దురాచారుండైనను న
న్నే మది నమ్మి భజించెడు నియత
స్వాంతుఁడు సాధువ యని తెలియం దగు
సద్వ్యవసాయుఁడు సాధువు గాఁడే
ఆ భవ్యుఁడు వే ధర్మాత్ముం డగు
నత్యంతం బగు శాంతిని బొందెడు

నా భక్తుం డగు వాఁ డెన్నండును
నాశముఁ బొందఁడు నూవే పార్థా!
విజ్ఞానాన్విత......

పాపాన్వయసంభవు లైనను నను
బత్తిని గొల్చిన ముక్తిని గాంతురు
శ్రీపుణ్యాన్వయమందును బుట్టువు
సెందిన వారలఁ జెప్పఁగ నేటికి
ఈ నరలోక మనిత్య మసుఖదం
బీ జగమందును నరుఁడై పుట్టితి
మానవజన్మం బతిదుర్లభ మిట
మానక నన్ను భజించి తరింపుము

నాపై మన సిడి ననుఁ బూజింపుము
నాకున్ మ్రొక్కుము నా భక్తుఁడ వగు
మీ పగిదిన్ నావాఁడ వైన న
న్నే పొందుదువు సుమన్నా! పార్థా!
విజ్ఞానాన్విత......

నీకుఁ బ్రీతి గలుగన్ నీ హితమ్మును గోరి
యాత్మబోధకమ్ముల్ లైన కొన్ని
పరమవాక్యములనున్ మరల నే వినిపింతు
నర్థి నాలకింపుమ్ మన్న! పార్థ!

దేవతలకు మహర్షులకు నాదిప్రభుం డగు నా ప్రభావము
దేవతలును మహర్షివరులును దెలియఁ జాలరు ఫల్గునా!

అజుని లోకేశ్వరుని బరుని ననాది నవ్యయు న న్నెఱింగిన
మనుజు లఖిలాఘముల వీడ్కొని సుగతి నొందుదు రర్జునా!

శమము దమమును బుద్ధి జ్ఞానము సత్యమును నిర్మోహగుణమును
క్షమయు భవము నభావమును సౌఖ్యమును దుఃఖము భయము నభయము
సమత తుష్టి యహింస యీవి యశమ్ము నయశముఁ దపము నను భా
వము ల వన్నియుఁ బ్రాణులకు నా వలనఁ గల్గెడు ఫల్గునా!

జగతి నీ ప్రజలన్ సృజించిన సప్తఋషులు మనువులు నల్వురు
స్వగతభావను లగుచు నా మది జనన మందిరి భారతా!

నా విభూతిని యోగమును సద్భావనాగతి నెఱుఁగు పుణ్యులు
పావనాచలయోగసంపద్భావు లగుదురు పాండవా!
నా వలన సర్వమ్ముఁ బొడమును నడచుటయు భావించి సతతము
భావయుతు లగు బుధులు నన్నున్ బత్తిఁ గొల్తురు కౌరవా!

ఒండొరులకున్ నాదు మహిమము నోలిఁ జెప్పుచు బోధ సేయుచు
మెండుకొని నా భక్తు లెలమి రమించుచుందురు ఫల్గునా!
సతతయుక్తతఁ బ్రీతి నను నాసక్తిఁ గొల్చెడు వారికిని మ
ద్గతిని గూర్చెడు బుద్ధియోగముఁ గలుగఁ జేయుదు నర్జునా!
కరుణ నా భక్తులకు నంతఃకరణమున నే నుండి మోహపు
టిరులు భాస్వజ్జ్ఞానదీపిక నెడయఁ జేసెద భారతా!

అర్జునుఁడు:—

పరబ్రహ్మ మని పరంధాముఁ డని
పవిత్రుఁ డని పరముం డని యజుఁ డని

నిరామయుం డని యాదిదేవుఁ డని
నిత్యుం డని దివ్యుం డని విభుఁ డని
నిరంతరమ్మును మహర్షు లందఱు
నినున్ నుతింపఁగ నే వినుచుండుదుఁ
బరేశ ! నీవున్ స్వయమ్ముగా నిది
వచింపఁగా విని ధన్యుఁడ నైతిన్.

సీ. నీ వచించిన దెల్ల నిక్కువం బని యెంతు
దేవదానవులు నీ దివ్యమహిమ
నెఱుఁగఁ జాలరు నిన్ను నీవ యెఱుంగుదు
గాక యన్యులకు శక్యమె మహాత్మ !
పురుషోత్తమ ! యచింత్య ! భూతేశ ! పరమాత్మ !
దేవదేవ ! జగత్పతీ ! యనంత !
పుండరీకదళాక్ష ! భూతభావన ! భక్త
లోకైకరక్షావిలోలహృదయ !

లీల నవిరతమ్ము నీ లోకముల నెల్ల
నిండి యేలుచున్న నీదు దివ్య
తరవిభూతు లెల్లఁ గరుణాపరత నాకు
నెఱుఁగఁ జెప్పు మయ్య యీశ ! కృష్ణ !

ఎట్లు దలఁచుచు నిన్ను నే నెఱుఁగు వాఁడ
నిన్ను నే భావములను జింతింప వలయు
నీ విభూతియోగముల వివరింపు మింక
నీదు వాక్యామృతము తృప్తి నీదు నాకు.

కృష్ణుఁడు:—

అన్న ! నాదు విభూతు లవి యనంతములు నీ
కన్నియుం దెలుపఁగా నలవి గా దిపు డందుఁ
గొన్ని యివి వినఁగదే కురువంశతిలక !
అఖిలభూతగణాంత రాత్ముండ నేను
అనఘ ! భూతాదిమధ్యాంతములు నేను
ఆదిత్యవితతిలో నల విష్ణు వేను
జ్యోతిర్గణమ్ములో సూర్యుండ నేను
అల మరీచి మరుచ్చయమ్ములో నేను
సకలతారకలలోఁ జంద్రుండ నేను
వేదంబులను సామవేదంబ నేను
ఎల్ల దేవతలలో నింద్రుండ నేను
జ్ఞానేంద్రియములలో మానసమ నేను
భూతసంతతులలోఁ జేతనను నేను

అన్న ! నాదు విభూతు......

సర్వరుద్రులలోన శంకరుఁడ నేను
యక్షరాక్షసులలో యక్షపతి నేను
వసుసమూహమ్ము లోఁ బావకుఁడ నేను
ధారుణీధ్రములలో మేరువను నేను
అల పురోధలలో బృహస్పతిని నేను
సైన్యాధిపతులలో స్కందుండ నేను
సరసులలో నెల్ల సాగరుఁడ నేను
ఋషిసంతతులలోన భృగుమాని నేను

ఉక్తిజాలమ్ములో నోంకార మేను
యజ్ఞములలోన జపయజ్ఞమను నేను
అన్న ! నాదు విభూతు......

స్థావరములందు హిమశైలమను నేను
సాలములలోన నశ్వత్థంబ నేను
సారమానులలోన నారదుఁడ నేను
వితతగంధర్వసంతతులలో నెల్లఁ
బ్రఖ్యాతిఁ గన్న చిత్రరథుండ నేను
ఘనసిద్ధగణములోఁ గపిలముని నేను
సైంధవములందు నుచ్చైశ్శ్రవమ నేను
హా స్తివర్గములోన నభ్రకరి నేను
నరసంఘములలోన నరపతిని నేను
ఆయుధములందు వజ్రాయుధమ నేను
అన్న ! నాదు విభూతు......

ధేనువులలోఁ గామధేనువను నేను
జనయితలలోఁ బంచసాయకుఁడ నేను
వ్యాళసంతతులలో వాసుకిని నేను
నాగజాతములో ననంతుండ నేను
వరయాదసులలోన వరుణుండ నేను
అఖిలపితృసమితిలో నర్యముఁడ నేను
సంయమనకరులలో సమవర్తి నేను
ఆ దైత్యులందుఁ బ్రహ్లాదుండ నేను
గణనకారులలోనఁ గాలంబ నేను
మృగసమూహములలో మృగరాజు నేను
అన్న ! నాదు విభూతు......

ఖగసంతతులలోన గరుడుండ నేను
పరిశుద్ధికరులలోఁ బవనుండ నేను
తతశస్త్రధరులలో దాశరథి నేను
శకులీకులమ్ములో మకరంబ నేను
సకలాపగలలోన జాహ్నవిని నేను
అఖిలసర్గాదిమధ్యాంతములు నేను
విద్యలం దధ్యాత్మవిద్యయే నేను
వక్తలం దెల్ల సద్వాదంబ నేను
ఘనవర్ణములలో నకారంబ నేను
వరసమాసములలో ద్వంద్వంబ నేను
అన్న ! నాదు విభూతు......

క్షయరహిత మైనట్టి కాలంబ నేను
సర్వతోముఖుఁ డగుచేఁ జేను ధాత నేను
ఎల్ల సృష్టి హరించు మృత్యువను నేను
ఉర్వియందు భవిష్యదుద్భవము నేను
స్త్రీలలోఁ గీర్తియున్ శ్రీయు మేధయును
ధృతియు క్షమయును సంస్మృతియు వాక్కు నేను
సామములలో బృహత్సామంబ నేను
క్షమను ఛందములలో గాయత్రి నేను
క్షితి నెలలలో మార్గశీర్షంబ నేను
సర్వ ఋతువులలో వసంతంబ నేను
అన్న ! నాదు విభూతు......

జూదరులలో నెల్ల జూదంబ నేను
తేజస్విపరులలోఁ దేజంబ నేను

విజయవంతులలోన విజయంబ నేను
వ్యవసాయికులలోన వ్యవసాయ మేను
సత్త్వవంతులలోన సత్త్వంబ నేను
వృష్ణివర్యులలోనఁ గృష్ణుండ నేను
పంచపాండవులలో ఫల్గునుఁడ నేను
అఖిలమౌనులలోన వ్యాసుండ నేను
సుకవివర్యులలోన శుక్రుండ నేను
దండధారులలోన దండంబ నేను
విజిగీషులందు శోభిలు నీతి నేను
మహిగోప్యములలోన మౌనంబ నేను
జ్ఞానవంతులలోన జ్ఞానంబ నేను
విశ్వభూతములలో బీజంబ నేను
అన్న! నాదు విభూతు......

అర్జునా! పలు పలుకు లేల?
ఏది యూర్జిత మేది శ్రీకర
మేది భూతియుతం బ దంతయు
నాదు తేజోంశమ్మునన్ జన
నమ్ము నొందిన దని యెఱుంగుము
ఆదుకొని నే నిండి యుండుదు
నంతటన్ జగమందు నే ఆయి
లేదు నా కంటెను మ తేదియు
లేదు లేదు ధనంజయా!

అర్జునుఁడు:—

న న్ననుగ్రహించి నాకుఁ దెల్పిన మహా
ధ్యాత్మయోగపరరహస్యము లగు

నీదు వాక్యములను నాదు మోహతమమ్ము
విరిసి పోయెఁ జూవె విశ్వరూప!

అఖిలభూతసంభవాంతంబులను నీవు
విస్తరించి చెప్ప వింటి దేవ!
మఱియు నీదునతులమాహాత్మ్యమును వింటిఁ
గమలనేత్ర! యెఱుకఁ గంటి మంటి.

ఈశ్వరా! నీ విపుడు చెప్పిన దెల్ల సత్యమ నా మదిన్ నీ
యైశ్వర మ్మగు విశ్వరూపము నరయ నిచ్ఛ జనించె నా కా
శశ్వదద్భుతరూపముం గన శక్య మయ్యెడు నేనియున్ యో
గీశ్వరేశ్వర! దానిఁ జూపఁగదే గదాధర! మాధవా!

కృష్ణుఁడు:—

ఈ కన్నుల నా విశ్వరూప మది
యీవు గనుంగొనఁ జాలవు గానన్
నీ కిచ్చితి నిట దివ్యదృష్టి మహా
నీయ మ్మగు నా యైశ్వరయోగము
లోకాతీతము విశ్వరూప మా
లోకింపుము సచరాచర మగు నీ
లోకం బంతయు నొక్కెడ నం దవ
లోకింపఁగ నగుఁ జూవే పార్థా!

వేనవేల్ వివిధాకృతులతో వెలసి వసురుద్రాదిసురసం
తానకలిత మదృష్టపూర్వ ముదంచితాద్భుతనిలయ మగు నా
మానితాకృతిఁ జూడుమా నీ మదిని గోరిన దెల్లఁ దప్పక
కానఁబడు నాయందు నిదిగో కనుము కనుము ధనంజయా!

(విశ్వరూపముఁ జూపును.)

అర్జునుఁడు:— (దివ్యదృష్టితో విశ్వరూపముం జూచి మహాశ్చర్యనిమగ్నుఁడై గగుర్పొడిచిన మేనితో పునఃపునస్సాష్టాంగదండప్రణామమ్ము లాచరించి కృతాంజలియై)

జయజయ విశ్వేశ్వరా! శశ్వదాశ్చర్యభావాకరా! విశ్వరూపా! నిరస్తానమద్భక్తసంతాప! దేవాదిదేవా! మహాదివ్యయోగానుభావా! జగత్సర్గరక్షాంతకేళీవిలోలా! దయాశీల! కాలానలజ్వాలికామాలికాభీలతేజఃప్రభాజాల! పాపాభ్రవాతూల! దివ్యాంబరాలంక్రియామాల్యగంధానులేపోజ్జ్వలానేకదేహా! యసంఖ్యాకబాహాసముద్యద్గదాఖడ్గచక్రాదిదివ్యాయుధవ్యూహా! భద్రావహా! యాగపద్యోదయత్కోటిమార్తాండబింబాతిగోచ్చండసందీప్తదీప్తిచ్ఛటాదుర్నిరీక్ష్యా! మహాయోగిచిత్తైకలక్ష్యా! జగత్పావనా! భూతసంభావనా! యాదిమధ్యాంతశూన్యా! సమస్తామరశ్రేణిసమ్మాన్య! నీ విశ్వరూపమ్ము నేఁ జూచుచున్నాఁడ నోహో! మహాశ్చర్యమాశ్చర్య మో దేవ! నీ దివ్యదేహమ్మునన్ బ్రహ్మరుద్రాది సర్వామరౌఘమ్ములున్ సర్వదిక్పాలురున్ సర్వదేవర్షులున్ సర్వభూతమ్ములున్ సర్వగంధర్వులున్ విశ్వులున్ యక్షులున్ సిద్ధులున్ సాధ్యులున్ జక్కఁ గన్పట్టుచున్నారు వీ రందఱున్ సంతతాశ్చర్యనిర్మగ్నులై నిన్ను వీక్షించుచున్నారు బృందారకుల్ గొంద ఱందందు నీలోఁ బ్రవేశించుచున్నారు భీతాత్ములై వారిలోఁ గొంద ఱందందు హస్తమ్ములన్ మోడ్చి నీ దివ్యరూపమ్ము వర్ణించుచున్నారు దేవర్షులున్ సిద్ధులున్ నిన్ను 'దేవాదిదేవ ప్రసీద ప్రసీదేతి' వాక్యమ్ములన్ వేఁడుచున్ స్వస్తిగీతమ్ములం బాడుచున్నారు లోకేశ్వరా! యక్షరం బౌ పరబ్రహ్మ మీవే సదా విశ్వలోకాశ్రయ మ్మైన చిద్వస్తు వీవే జగద్ధర్మశశ్వత్కసంగోప్త వీవే కదా! దేవ! బ్రహ్మాండముల్ నిండి యాద్యంతముల్ లేక యేకాకృతిన్ వెల్గుచున్నావు నీ వక్త్రబాహూరు

నేత్రాదిసర్వాంగముల్ లెక్కకున్ మీఱి పేరక్కజంపాటు గల్గించెదున్ నాథ! నీ యుగ్రరూపమ్ము వీక్షింపఁగా లేక నీ యుగ్రతేజమ్ము సైరింపఁగా లేక లోకమ్ము లెల్లన్ మహాతాపముం బొందెడుం దండ్రి! కాలానలాభీలదంష్ట్రాకరాళాస్యమై చంద్రసూర్యాత్మకానేకనేత్రోజ్జ్వలం బైన నీరూపముం జూచి ధైర్యమ్ము గోల్పోయి విశ్రాంతియున్ శాంతియున్ లేక నేనుం గటా! దిగ్భ్రమం జెందియున్నాఁడ నన్నుం బ్రసన్నుండవై కావవే దేవదేవేశ!

(కన్నులరమోడ్చి నమస్కరించి మరలఁ గన్నులు దెఱచి చూచి)

ఓహో! మహాశ్చర్య మాహా! యి దేమీ! జగన్నాథ! భీష్ముండు ద్రోణుండుఁ గర్ణుండు దుర్యోధనుం డాదిగా ధార్తరాష్ట్రుల్ సమస్తావనీపాలసంఘమ్ముతో నస్మదీయాగ్రయోధాళితోఁ గూడ వేవేగ దంష్ట్రాకరాళాతిభీమమ్ములై నాలుకల్ గ్రోయు నీ వక్త్రజాలమ్ములం జొచ్చుచున్నారు నీ నోళులం జేప్పరింపంగఁ బెన్గోఱలం జిక్కి వీరెల్ల వేవ్రక్కలై చెక్కలై ముక్కలై గుండయై పిండియై పోవుచున్నారు రెండొడ్లు నిండారఁగాఁ బాఱు నేఱుల్ సముద్రంబునుం బోలెఁ జండప్రచండంబుగా మండు కాలాగ్నిలోఁ దండతండమ్ములై కూలు నుద్యత్పతంగమ్ములుం బోలె నీ ప్రాణులెల్లం గటా! నీదు పెన్నోళులందున్ వడిం గూలెడున్ బ్రజ్వలద్ఘోరదుర్వారవక్త్రమ్ములం గూలు నీ సర్వలోకమ్ములన్ మ్రింగుచున్ నాలుకల్ సాఁచి నీ దౌడలన్ నాకుచున్నావు నీ యుగ్రతేజమ్ము చేతన్ జగమ్మెల్ల నిండించి మండించుచున్నావు దేవేశ! యత్యుగ్రరూపుండ వౌ నీవ దెవ్వండవో యేల యీ లీల వర్తించుచున్నాఁడవో నా యెడన్ సుప్రసన్నుండవై నాకుఁ జెప్పం గదే నీదు చెయ్దమ్ము గుర్తింపఁగా లేక యత్యంతపర్యాకులాత్ముండనై

నిన్ను నే వేఁడుచున్నాఁడ నీపాదభక్తుండ నీ వాఁడ నన్నుం గటాక్షింపవే సర్వలోకాధినాథా! జితక్రోధ! లక్ష్మీసనాథా! నమస్తే నమస్తే నమః.

కృష్ణుఁడు:—

ఏను గాలుఁడ లోకముల హరియింపఁ బూనితి నీవు యుద్ధము మానినను బ్రతియోధు లందఱు మడిసి రింతకు మున్న నాచేఁ గాన మార్తురఁ గెలిచి కీర్తిఁ గనుము రాజ్యముఁ బొందు మిఁక య్యాన నిపుడు నిమిత్తమాత్రుఁడ వగుము నీవు ధనంజయా!

దుర్జయు లనఁ దగు భీష్ముఁడు కర్ణుఁడు
ద్రోణుఁడు సైంధవుఁ డాదిగఁ గల వి
స్ఫూర్జితబలు లగు పగతుఱ నే మును
పొలియించితి నని నమ్ముము వీరలు
నిర్జితు లగుదురు తప్పక నీచే
నీ విట శంకయు జెంకును బొందకు
మూర్జితశక్తి జయింతువు గావున
యుద్ధము సేయఁ గడంగుము పార్థా!

అర్జునుఁడు:— (అతిభీతుఁడై గడగడ వడంకుచుఁ గేలు మోడ్చి నమస్కరించి డగ్గుత్తిక నత్తుకొను కుత్తుకతో)

తగు జగన్నివాస! నీదు పొగడు నాలకించి యిపుడు
జగ మి దెల్ల నెలమిఁ బొంది సమనురక్తి నుల్లసిల్లె
దిగులు గుడిచి రాక్షసాలి దెసల కుఱికి పరుగు లిడియె
వెగడు మాని నీకు సిద్ధవితతు లెల్ల మ్రొక్కెడున్.

ఆదిదేవుఁడ వాదిపురుషుఁడ వఖిలవిశ్వనిధానమవు నీ
వాదికర్తవు బ్రహ్మదేవున కక్షరబ్రహ్మమవు వేత్తవు
వేదితవ్యుఁడ వఖిలసదసద్విశ్వపరుఁడవు పరమగతి వా
సాదు లిట నీ కేల మ్రొక్కరు సర్వలోకనియామకా!

యముఁడవు వరుణుఁడ వగ్నివి నీవే
యనిలుండవు చంద్రుండవు నీవే
కమలభవునకున్ దండ్రివి నీవే
కశ్యపాదిమునివర్గము నీవే
యమితవిక్రముఁడ వతులితవీర్యుఁడ
వఖిలగతుఁడ వయి యఖిలము నీవై
యమరి యుండుదువు విశ్వమునందు న
నంత! యనంతశయాన! మాధవా!

మ్రొక్కెదను మ్రొక్కెదను నీకును
మ్రొక్కెదను వేసార్లు మ్రొక్కెద
మ్రొక్కెదను మఱిమఱియు మ్రొక్కెద
మ్రొక్కెదను జోఁగిలుచు మ్రొక్కెద
మ్రొక్కెదను నీ ముందువెనుకల
మ్రొక్కెదను నీ క్రిందుమీఁదుల
మ్రొక్కెదను నీ కంతటను
నా మ్రొక్కులం గొను మచ్యుతా!

ఇట్టి నీ మహిమం బెఱుంగక యీవు సఖుఁడ వటన్న చేనువుం
బట్టియో పొరపాటుచేతనో ప్రణయముననో నవ్వులాటలకో
జెట్టులికపున్ వరుసనో నీ కట్టెదుటనో వెనుక నుండియొ
నెట్టుకొని యోకృష్ణ! యాదవ! నెచ్చెలీ! యని నిన్నుఁ బిలుచుచే

జేట్టుకొని విహరించే నప్పుడు శయ్యలందుఁ బరుండు నపు డొక
పట్టునం గూర్చుండు నప్పుడు పంక్తిభుక్తు లొనర్చు నప్పుడు
నెట్టి మన్నన లేని చెయ్దము లేను జేసితినో కదా నా
యట్టి యపరాధముల నెల్లఁ గృపాకరా ! సైరింపవే.

తల్లిం దండ్రివి సద్గురుఁడవు గురుతరుఁడవు పూజ్యుఁడ వీ లోకమునకు
నల్లలితాప్రతిమప్రభావ ! నీ సముఁడే లేఁ డన నధికుఁడు గలఁడే
పల్లవితస్థిరభక్తిని దావకపదపద్మములకుఁ జాఁగిలి మ్రొక్కెదఁ
దల్లిం దండ్రియు సుతునిం బలె నను దయఁ గని తప్పులు సైఁపవె తండ్రీ !

ఎపుడు చూడ నట్టి యీ రూపు గని సంత
సిలితిఁ గాని భీతిఁ జెదరె మనసు
కాన నీదు తొంటి ఘనసౌమ్యరూపమ్ముఁ
జూపి నన్నుఁ గరుణఁ జూడు మీశ !

సీ. నీలాంబుదశ్రీల నేలు మైచాయతో
ముద్దారు నెలనవ్వు మోముతోడఁ
గరుణారసముఁ జిల్కు కన్నుఁదామరలతోఁ
దళుకు నిద్దంపుఁజెక్కిళులతోడ
శంఖచక్రాన్వితాజానుబాహువులతో
సిరికి నివాసైన పేరురముతోడ
జిలుగు హొంబట్టు దువ్వలువతో నొదలం
జెలువారు నెమిలిపించెమ్ముతోడ

విశ్వమోహనసౌందర్యవిలసిత మయి
వెలయు నీ దివ్యమంగళవిగ్రహమ్ముఁ
జూడఁ గోరెద నాహృదుఁ జూపు మయ్య !
విశ్వభయదప్రతాప ! యో విశ్వరూప !

కృష్ణుఁడు:—

సీ. అన్న ! పార్థ ! యనుగ్రహమున నీ కీ విశ్వ
రూపమ్ము నిజశక్తిఁ జూపినాఁడ
నాద్యమ్ము తేజోమయ మ్మనంతము దీని
నెవ్వరుం జూడ లే రీవు దక్క
వేదయజ్ఞాధ్యాయ వివిధక్రియాతపో
దానాదికములచే నైనఁ గాని
యిట్టి నా రూప మింక నెవరికిం జూడ శ
క్యము గాని దిది చూడఁ గలిగి తీవ
ఘోర మీ రూపమును గనుంగొన్న కతన
దిగులు వల దన్న ! వల దన్న ! నొగులు నీకు
వెఱ పుడిగి ప్రీతితోడఁ గ్రమ్మఱ మదీయ
మైన యీ రూప మిదె చూడు మన్న ! విజయ !

(విశ్వరూప ముపసంహరించి మరలఁ దన తొంటి సౌమ్యవాసుదేవరూపముం దాల్చి యర్జును నోదార్చును)

అర్జునుఁడు:—

అనఘ ! నీదు సౌమ్య మగు మానుషాకృతిం
గన్ను లార మగుడఁ గాంచి యిపుడు
భయము వాసి ప్రకృతిఁ బడసి నా చిత్తమ్ము
తెలుకొనియె వాసుదేవ ! కృష్ణ !

కృష్ణుఁడు:—

ఈవు చూచిన విశ్వరూప మిఁక
నెవరికిం గన నలవి గానిది

దేవతలు ననిశమ్ము గడకన్
దీని జూడగ గోరుచుందురు
ఈ విధపు రూ పెట్టి సత్త్రియ
లేనియుం జూపింప జాలవు
పావన మ్మగు భక్తి చేతన
పడయ నగు నిది ఫల్గునా!

నా కయి కర్మము లొనరుచు వాడును
నన్నే సుగతిగ నమ్మిన వాడును
చేకొని దారసుతాదుల చెలిమికి
జిక్కక నిస్సంగుం డగు వాడును
లోకము నందలి సర్వభూతముల
లో నను జూచుచు నిర్వైరుండై
నాకుం గూర్చెడు నా పదభక్తుడు
నన్ను బొందెడుం జూవే పార్థా!

అర్జునుడు:—

ఈ గతిని నిను భక్తియోగసముపాసనా
యుక్తి గొలిచెడు వారె యోగవిత్తములో
యవ్యక్తనిష్ఠులై యక్షరోపాసనా
యుక్తి గొలిచెడు వారె యోగవిత్తములో
కృప వెలయ నా కెఱింగింపవే కృష్ణ!

కృష్ణుడు:—

భక్తియోగముచేత నన్నుం
బడయు టెంతయు సులభ మల యు

వ్యక్తమార్గము మిగుల దుస్తర
మని యెఱుంగుము ఫల్గునా!
యుక్తులై సంతతము నాయం
దుల్లమును నెలకొల్పి శ్రద్ధా
భక్తియుక్తిని గొలుచే భక్తులె
యుక్తతము లని యెంతుఁ జూవే.
భక్తియోగము......

నిరత మింద్రియములను లోఁగొని
నిఖిలభూతహితైషులై సు
స్థిరము కూటస్థమ్ము నవిని
ర్దేశ్య మచలము సర్వగత మ
క్షర మచింత్యం బాద్య మవ్య
క్తమ్ముఁ గొలుచేచే సర్వసములై
వరఁగు బ్రహ్మోపాసకులు మ
త్పదమునే ప్రాపింతు రైనను
గరము కష్టతరమ్ము సూవే
కడఁగి యవ్యక్తమునఁ జిత్తముఁ
దిరము చేసి భజింప నేర్చుట
దేహవంతుల కర్జునా!
భక్తియోగము......

ఎల్ల కర్మమ్ములను మత్పర
వృత్తి నా కర్పించుచేను నను
నెల్లపుడును ననన్యయోగో
పేతులై తలఁచుచేను నాయం

దుల్ల ముంచి భజించే భక్తుల
నుగ్రసంసరణాంబురాశిం
ద్రెళ్లకుండ సముద్ధరించి త
రింపఁ జేసెద సత్కృపన్.

భక్తియోగము......

పూని మదినా యందు నిలుపుము
బుద్ధియును నాయందు యిటు మి
న్లైన మే నటి నంతనే నా
యంద తప్పక యుందు వెప్పుడు
అటులు చిత్తము దిరముగా నా
యంద నిలుపఁగఁ జాలవేనియుఁ
బటుతరై కాభ్యాసయోగము
బలిమి నన్నుం బొందఁ గోరుము
అదియు నలవడ కున్నఁ గర్మము
లన్నియున్ నాకొఱకుఁ జేయుము
మదిని నమ్మి మదర్థమై క
ర్మములఁ జేసియు సిద్ధిఁ గాంతువు
ఇదియుఁ జేయఁగఁ జాలవేనియు
నిం కిటన్ మద్యోగమున్ మదిఁ
గదియఁ జేసి యతాత్మకుఁడవై
కర్మఫలముల విడిచి పెట్టుము
జ్ఞాన మభ్యాసమ్ముకంటెను
జాల శ్రేయోదాయి యగు నా
జ్ఞానసంపదకంటె నెంతయు
ధ్యానయోగ మ్ముత్తమం బా

ధ్యానయోగముకంటెఁ గర్మఫ
లైకసంత్యాగమ్మె మే ల
మ్మానితత్యాగమ్మె శాంతికి
మనికిప ట్టగు నర్జునా!
భక్తియోగము......

అలుగ కఖిల ప్రాణులన్ దయ
నరసి చెలిమిం జూపుచున్ క్షమ
గలిగి మమతాహంకృతులఁ బో
కడఁచి సుఖదుఃఖముల సముఁడై
ఔలమి నెప్పుడుఁ దనిసి యోగస
మేతుఁడై దృఢనిశ్చయముతో
నొలసి బుద్ధియు మనసు నా యం
దునిచి నియతిన్ నన్నుఁ గొలుచుచు
నాకుఁ గూర్చెడు నాదు భక్తుఁడు
నాకుఁ బ్రియుఁ డగు నర్జునా!
భక్తియోగము......

లోకములఁ దాఁ గలఁత వెట్టక
లోకములచేఁ గలఁతఁ బొందక
శోకహర్షామర్షభీతి
క్షోభముల పాల్గాక దక్షుం
డై కడున్ శుచియై వినిస్పృహుఁ
డై తటస్థుండై వ్యథం గై
కోక పొంగక క్రుంగ కడలక
కోర కలుగక యెందు సక్తుఁడు

గాక త్యక్తశుభాశుభాఖిల
కర్ముఁడై నను భక్తిఁ గొలుచేచే
నాకుఁ గూర్చెడు నాదు భక్తుఁడు
నాకుఁ బ్రియుఁ డగు నర్జునా!
భక్తియోగము......

పగఱయెడ సఖులందు గౌరవ
పరిభవమ్ములఁ జెలిని వేఁడిని
సుగమునందును దుఃఖమందును
బొగడునను దెగడునను నుబ్బును
వగపు నొందక సర్వసముఁడై
తగుల మొల్లక మౌనియై యె
ప్పగిది నే దేపాటి యొదవిన
బ్రదుకు దానన పుచ్చి తనియుచుఁ
దెగువ గైకొని యిల్ విడిచి సు
స్థిరమతిన్ నను భక్తిఁ గొలుచేచే
నాకుఁ గూర్చెడు నాదు భక్తుఁడు
నాకుఁ బ్రియుఁ డగు ఫల్గునా!
భక్తియోగము......

శ్రద్ధాన్వితులై సదోగ్యం బీ
సద్ధర్మామృతసారము మత్పర
బుద్ధిం గైకొని పొదలెడు భక్తులె
యిద్ధరఁ గడు నా కిష్టులు పార్థా!

* * *

క్షత్రియసత్తమ! యీ శరీర మిది క్షేత్రం బని వచియింపంబడు నీ
క్షేత్రము నెఱింగిన వానినిఁ దజ్ఞులు క్షేత్రజ్ఞుం డని చెప్పుచే నుందురు

క్షేత్రము లన్నిట నివసించిన యా క్షేత్రజ్ఞుఁడు నేనే యని యెఱుఁగుము
క్షేత్రక్షేత్రజ్ఞుల జ్ఞానంబె విశిష్టజ్ఞానము సూవే పార్థా!

ఏదో యాక్షేత్ర మెట్టిదో యెట్టి వికృతి
గలదో యెద్దాన నయ్యదిగలిగినదియొ
యల్ల క్షేత్రజ్ఞుఁ డెవ్వఁడో యతని మహిమ
లెట్టివో చెప్పెదను సంగ్రహించి వినుము.

ఋషిగణమ్ముచేత ఋక్ఛందములచేత
నతిసహేతునిశ్చితార్థము లయి
పరఁగు బ్రహ్మసూత్రపదములచే నది
బహువిధములఁ జెప్పఁబడియె ననఘ!

అయిదు మహాభూతములు నహంకృతి
యవ్యక్తమ్మును బుద్ధియుఁ బది యిం
ద్రియములు మానస మొకటియు నై దిం
ద్రియవిషయమ్ములు నను నిరువదినా
ల్గయిన తత్త్వములు సుఖము దుఃఖ మి
చ్ఛయుఁ బగయును ధృతి చేతన దేహేం
ద్రియతతి యను వికృతులతోఁ గూడిన
దే యీక్షేత్రము సూవే పార్థా!

మానమ్ము లేమి దంభము నొందమి యహింస
క్షాంతి యార్జవము నాచార్యసముపాసనము
నాత్మనిగ్రహము స్థైర్యము శౌచ మింద్రియా
ర్థములందుఁ బ్రబలవైరాగ్య మనహంకృతియు
జన్మమృత్యుజరారుజాదుఃఖదోషాను
దర్శనము దారపుత్రగృహాద్యనాసక్తి

సతత మిష్టానిష్టసంప్రాప్తి వేళలన్
సమభావమున నుంట సంగపరివర్జనము
నెపుడు నాయం దనన్యైకాంతభక్తి ని
ర్జనదేశవాసమ్ము జనుల పొం దొల్లమియు
సంతతాధ్యాత్మికజ్ఞానసంపత్తి త
త్త్వజ్ఞానకలితార్థదర్శనము నను నట్టి
యీ నిఖిలగుణసమితి
జ్ఞాన మని తెలియఁదగు
దీని కెడ మైన ద
జ్ఞానమ్ము పార్థ!

జ్ఞేయ మేదో తెలియఁ జెప్పెద విను మన్న!
యది యెఱింగికొన్న నమృత మొదవు
నది యనాది పరమ మగు బ్రహ్మ మది సత్తు
గాదు మఱి యసత్తుఁ గాదు విజయ!

అంతటఁ గాళులు చేతులు గల దది
యంతటఁ గన్నులుఁ దలలును గల దది
యంతట మొగములుఁ జెవులును గల దది
యంతట లోకము నలమి యుండు నది
సర్వేంద్రియగుణభాసిత మయ్యును
సర్వేంద్రియపరివర్జిత మయ్యది
సర్వము నంటక యుండిన దయ్యును
సర్వమ్మును భరియించెడు నయ్యది
గుణవిరహితమై వెలసిన దయ్యును
గుణముల నన్నిట ననుభవించు నది

యణువునకంటె నణీయం బయ్యె మ
హత్తునకంటె మహీయం బయ్యెది
మలసెడు భూతప్రకరమ్ములలో
వెలుపల లోపల వెలసియుండు నది
చలియింపకయును జలియించెడు నది
తెలియఁ బడని యతిసూక్ష్మవస్తు వది
దవుదవ్వులఁ దా దాఁగి యుండియును
దగ్గఱ నెప్పుడుఁ దవిలియుండు నది
యవిభక్తం బయి యుండియు భూతము
లందు విభక్తత నగపడు నయ్యెది
భూతములం బుట్టించుచుఁ బెంచుచుఁ
బొలియించుచు విహరించెడు నయ్యెది
జోతుల నెల్లను ద్యోతిలఁ జేసెడు
జోతి యయ్యెది తమోతీతం బది

జ్ఞానము జ్ఞేయము జ్ఞానగమ్య మయి
పూని సర్వహృత్పుటముల నెలకొను
పరంజ్యోతి యీ పరబ్రహ్మమే
పరమజ్ఞేయము భరతవరేణ్యా !

క్షేత్రమును మఱి జ్ఞానమ్మును జ్ఞేయ మిట్లు
రహిని జెప్పితి నీకు సంగ్రహము గాఁగ
దీని నెఱిఁగి నాదగు భక్తుఁడైన వాఁడు
బంధములఁ బాసి మద్భావమొందుఁ బార్థ !

ప్రకృతిపురుషు లనాదు లని నీ భావమందును గుర్తెఱుంగుము
వికృతులును గుణములును నేత త్ప్రకృతిభవములు ఫల్గునా !

కార్యకరణోత్పాదకతకుం గారణం బా ప్రకృతిపురుషుఁడు
కార్యగతసుఖదుఃఖకలనాకారణం బగు నర్జునా!

ప్రతతగుణముల ననుభవించెడుఁ బ్రకృతిగతుఁడై దేహి గుణసం
గతియె సదసద్యోనిజనిసంసృతికి హేతువు భారతా!

తనుగతుం డగు పురుషుఁ డనుమోదకుఁ డుపద్రష్టయును భర్తయు
ననుభవజ్ఞుం డీశ్వరుఁడు పరమాత్మ యనఁబడుఁ బాండవా!

పురుషుఁ బ్రకృతిని గుణములను నిటు బుద్ధి నెఱిఁగిన యాతఁ డెవ్విధిఁ
బరఁగినను గ్రమ్మఱ జనింపఁడు భరతవంశవతంసమా!

* * * *

కొంద ఱాత్మచే నాత్మ నాత్మఁ గనుఁ
గొందరు విమలధ్యానసక్తులై
కొందఱు గందురు సాంఖ్యయోగమునఁ
గొందఱు గాంతురు కర్మయోగమున
నిందులకుం గొఱ గాని వా రయిన
నితరులు చెప్పిన యుపదేశము విని
యందలి నమ్మిక నాత్మోపాసన
మాచరించి తరియింతురు పార్థా!

* * * *

జనన మందెడు నీ చరాచరసత్త్వసంతతు లెల్ల క్షేత్రం
బునకు క్షేత్రజ్ఞునకు నొదవిన పొత్తునన పొడముం జుమీ.

ఎల్లభూతములందు సరిగా నిరవుకొని యవి దెగినఁ దాఁ దెగ
కుల్లసిలు పరమేశుఁ గను వాఁ డెల్లఁ గను వాఁ డర్జునా!

ఆత్మమయుఁడై యెల్లప్రాణులయందు నీశ్వరుఁ డున్నవాఁ డని
యాత్మ నాత్మను హింస సేయని యతఁడు సద్గతి నొందెడున్.

పనులఁ బ్రకృతియె చేయుచుండెడు ననియు నాత్మఁ డకర్త నిష్క్రియుఁ
డనియు నరసెడు వాఁడె తత్త్వము నరయు వాఁడు ధనంజయా!

వేర్పడిన భూతమ్ము లాత్మన విస్తరిలి యొకచోట నుండుట
యేర్పడం గనువాఁడు బ్రహ్మపదైకతం గను ఫల్గునా!

అవ్యయుఁడు పరమాత్ముఁ డగుణుఁ డనాది నిష్క్రియుఁ డగుటచే దే
హావ్యవస్థితుఁ డయ్యుఁ జేయం డంటఁ డెంచుము భారతా!

అఖిలగతమై మిగుల సూక్ష్మత నంట కుండెడు నాకసము వలె
నఖిలతనుగతుఁ డయ్యు నప్పరమాత్ముఁ డంటఁడు పాండవా!

మిత్రుఁ డొక్కఁడె లోక మంతయు మిగుల వెలుఁ గొందించు పోలిక
క్షేత్రి క్షేత్ర మెల్లఁ గను వెల్గించెమన్ భరతర్షభా!

చేతోగత మగు జ్ఞానచక్షువున
క్షేత్రక్షేత్రజ్ఞుల యంతరమును
భూతప్రకృతివిమోక్షము నెఱిఁగిన
పురుషులు పరముం గందురు పార్థా!

జ్ఞానములలో మహోత్తమజ్ఞాన మిపుడు
ప్రీతిఁ గ్రమ్మఱ నీకుఁ జెప్పెదను విజయ
దీని నెఱిఁగిన యట్టి సన్మును లెల్లఁ
బరమసిద్ధిని దుదిఁ బొందుదురు సుమన్న!

ఈజ్ఞానము నుపాశ్రయించి వర్తించే సు
జ్ఞానవంతులు నాదు సారూప్యముం బొంది
సర్గమ్మునం దైన జననమ్ముఁ గనఁబోరు
ప్రళయమ్మునం దైన బాధలం బడరు

ప్రకృతిరూపము మహద్బ్రహ్మ మా నా యోని
యందు నేఁ బొందిఁ గర్భాధాన మొనరింతు
సర్గాదియందు నీ సర్వభూతోద్భూతి
యద్దానివల్లనే యయ్యెడుం జూవె
సర్వయోనులయందు సంభవించిన యట్టి
యఖిలమూర్తులకును మహద్బ్రహ్మమే ప్రకృతి
యోనియై యొప్పుఁ దద్యోనియందు నమోఘ
బీజమ్ము నెలకొల్పు పిత నేన చూవె
ప్రకృతిభవ మైన సత్త్వరజస్తమోగుణ
ప్రతతి క్షేత్రమున క్షేత్రజ్ఞునిం బంధించు
నందు సత్త్వము నిర్మలానామయప్రకా
శక మగుచు జ్ఞానసుఖసంగమున బంధించు
రాగాత్మకం బయిన రజము తృష్ణాసంగ
సముదితం బయి కర్మసంగమున బంధించు
నజ్ఞానభవము మోహన మైన తమము ని
ద్రాప్రమాదాలస్యరజ్జువుల బంధించు
సత్త్వమ్ము ఘనసౌఖ్యసంగమును గలిగించు
రజము సంతతము కర్మప్రసంగముఁ గూర్చు
సత్త్వసంభూతసుజ్ఞానమున్ హరియించి
తమమును బ్రమాదసంగమును గల్గించు
రజమును దమంబును దిరస్కార మొనరించి
సత్త్వమ్ము పెంపొందు సత్త్వమ్మును దమమ్ము
నణఁగఁ ద్రొక్కి రజమ్ము నభివృద్ధి నొందు స
త్త్వము రజమ్ము నడంచి తమము వర్ధిల్లు

ఈ దేహామునయందు నెల్లద్వారములలో
జ్ఞానప్రకాశమ్ము సంభవించిన యపుడు
విమలసత్త్వగుణాభివృద్ధి చేకుఱె నంచు
భావించు నెంతయున్ భావ్యమ్ము నూవె
రజము వర్ధిలఁ గ్రియారంభము ప్రవృత్తి లో
భము తృష్ణ యశమమ్ము ప్రభవించెడుం బార్థ!
తమము పెంపొంద మోహాము నప్రకాశమ్ము
నప్రవృత్తి ప్రమాద మావహిలుఁ జూవె
సత్త్వమ్ము వర్ధిల్లఁ జెనిపోవు దేహి ని
ర్మలతత్త్వవిల్లోకములయందు జన్మించు
రజ మెసఁగఁ జచ్చి కర్మరులందును దమోగు
ణోన్నతిం దెగి మూఢయోనులను బుట్టు
శుద్ధసాత్త్వికభావసుకృతకర్మమునకున్
విమలసాత్త్వికఫలావిర్భాతి సిద్ధించు
రాజసమ్మునకు దుర్భరదుఃఖము ఫలమ్ము
తామసమ్మునకు దుస్తరమోహాము ఫలమ్ము
సత్త్వగుణసంపదన్ జనియించు జ్ఞానమ్ము
రాజసగుణమ్మునం బ్రభవించు లోభమ్ము
తామసగుణమ్మునం దతమోహామును బ్రమా
దమును నజ్ఞానమున్ * సమకూడు విజయ!
సాత్త్వికుల కూర్ధ్వగతి సంప్రాప్త మగును రా
జసులకున్ మధ్యమస్థానమ్ము సేకూరుఁ
గ్రూరకర్మజఘన్యగుణవృత్తికలనాభి
హాతతామసుల కధోగతి గల్గుఁ బార్థ!

* దాపరించెడిని.

త్రిగుణములకంటె వేఱగు కర్త లేఁ డంచుఁ
ద్రిగుణసంతతికిని నతీతుఁ డీశ్వరుఁ డంచుఁ
దనలో నెఱుఁగు నాత్మతత్త్వదర్శనుఁ డైన
యాతండు మద్భావ మందెడున్ విజయ!
దేహి తత్త్వ మెఱింగి దేహజము లైన యీ
త్రిగుణముల సంగతి నతిక్రమించి దురంత
జన్మమృత్యుజరారుజాదుఃఖముక్తుఁడై
పరమపదముం బొందు భరతకులముఖ్య!

అర్జునుఁడు:—

ఎట్టి లక్షణంబు లెట్టి యాచార మ
దెట్టి వర్తనము గలట్టి వాఁడు
త్రిగుణములకుఁ దా నతీతుఁ డౌనో నాకు
నేర్పడంగఁ జెప్పవే మహాత్మ!

కృష్ణుఁడు:—

సీ. విపులప్రకాశప్రవృత్తిమోహములు ప్రా
ప్తించు నప్పుడును బ్రాప్తింప నపుడు
ద్వేషకాంక్షలు లేక త్రిగుణచేష్టలి వంచుఁ
జలియింప కటుఁ దటస్థత వహించి
స్వస్థుఁడై ధీరుఁడై సౌఖ్యదుఃఖములు భ
ర్మాశ్మలోష్టములు ప్రియాప్రియములు
మానావమానముల్ మఱియు నిందాస్తుతు
లరిమిత్రపక్షముల్ సరిగ నెంచి
యఖిలకర్మపరిత్యాగి యగుచు నన్నుఁ
గడఁక నేకాంతభక్తియోగమునఁ గొలుచు

నట్టి వాఁడు గుణాతీతుఁ డనఁగఁ బరఁగి
పావనబ్రహ్మపద మొందుఁ జూవె పార్థ!

అమృత మచల మవ్యయమ్ము
నై వెలుఁగు బ్రహ్మమునకు
విమలనిత్యధర్మమునకు
వినియతైకసౌఖ్యమునకు
నమృతగతికి నేఁ బ్రతిష్ఠ
నగుదుఁ గాదె ఫల్గునా!

పురుషోత్తముని నన్నుఁ
బొందించు యోగ మిది
నరులకున్ భవవార్ధి
తరణి యోఁ పార్థా!

పరమవిజ్ఞానసంభరణ మిది కైవల్య
కరణ మిది దుఃఖసంహరణ మిది వరగుణాభరణా!
అశ్వత్థ మను వృక్ష మది యూర్ధ్వమూలమై
శాశ్వతం బయి యధశ్శాఖలం బెంపొందు
దానికిని సకలవేదము లాకు లై యొప్పు
దాని తెలఁ గెఱుఁగు నాతండు వేదవిదుండు
మిగులు విషయము లనెడు చిగురుటాకులతోడ
నెగడు దిగుడుం బుట్టి తగులు మోసులతోడఁ
ద్రిగుణోదకముల వర్ధిలు దాని కొమ్మ లివి
దిగువకున్ మఱియు మీఁదికిని బ్రాఁకుచు నుండుఁ
గర మీ తరువు వేళ్లు కర్మానుబంధులై
నరలోకమునఁ గ్రింద నాటుకొని చౌఁబాఱు

దీని రూపిట్టి దని తెలియ శక్యము గాదు
దీనికిని నాదియును స్థితియు నంతము లేదు
గట్టి కూఁకటివేళ్లు గలయట్టి యీ ప్రాంత
చెట్టు నిస్సంగతాసిని బల్మిఁ దెగవ్రేసి
పుట్టుసావులఁ బెంచే నిట్టి మాయపుఁజెట్టుఁ
బుట్టఁ జేసిన యాదిపురుషునిన్ మనసులోఁ
బెట్టుకొని యపునరావృత్తి యా తత్పదము
పట్టువడు వెర వరయ వలెఁ జేమీా విజయా !

పురుషోత్తముని......

మానమును మోహమును మాని వర్తిలు వారు
పూని సంగపుదోసఁగుఁ బొంద కుండెడు వారు
అనిశ మధ్యాత్మనిత్యస్థితిం గొనువారు
వినివృత్తకాములై మన నేరిచిన వారు
సుఖదుఃఖశీతోష్ణముఖసంసరణహేతు
నిఖిలవివిధద్వంద్వనిర్ముక్తు లగు వారు
నిరతిశయ మవ్యయము నిత్యము నిరామయము
పరమ మగు తత్పదముఁ బడయఁగా నోపుదురు
తరణిచంద్రాగ్నులకు దాని వెలుఁ గొందింపఁ
దరము గా దది పొంది తిరిగి రా రెవ్వరును
దురితదూరమ్ము సంసరణబాధాసము
ద్ధరణ మది మత్పరంధామమ్ము విజయా !

పురుషోత్తముని......

జీవలోకమునందు జీవభూతుం డగుచు
నావిర్భవించు జీవాత్ముఁడు మదంశమే

యతఁడు ప్రకృతిస్థితము లయిన పంచేంద్రియ
ప్రతతిని మనమ్ముతో బలిమి నాకర్షించి
తను వెడలు నెడ వేఱు తనువుఁ బొందెడు వేళ
ననిలుండు తావి బలెఁ దనతోడఁ గొనిపోవు
మనసు శ్రోత్రమ్ము స్పర్శనము చక్షువు ఘ్రాణ
మును జిహ్వయును ననం జేను నింద్రియమ్ములం
దనువున నధిష్ఠించి తత్పరత జీవాత్మఁ
డనయమ్ము విషయముల ననుభవించుచు నుండు
తనుగతుని నుత్క్రాంతు ననుభోక్త గుణి జీవుఁ
గనరు మూఢులు గాంచెఁ గల రెఱుక గనువారు
చేతనముల్ నియతిమైఁ జేలుపు యోగులు దేహ
గతుఁ డైన జీవాత్మఁ గాంచఁగాఁ జాలుదురు
చేతనముం జేసియు నకృతబుద్ధులును విని
ర్గతవివేకులు జీవుఁ గనలేరు విజయా!
పురుషోత్తముని......

ఈ జగము వెలిఁగించు నినుని తేజము చంద్రు
తేజమును పావకుని తేజమును నాయదియ
పుడమిని బ్రవేశించి భూతజాతము నెల్లఁ
జెడకుండ నిజశక్తిచే నెపుడు ధరియింతు
రసమయుం డైన చంద్రముఁడనై యోషధుల
నెసఁగించి పస నించి యెల్లపుడుఁ బోషింతుఁ
బ్రాణితనువులఁ జొచ్చి వైశ్వానరుండనై
ప్రాణము నపాన మను పవనములతోఁ గూడి
ప్రాణిభుక్త చతుర్విధాన్నముల సంతతముఁ
బ్రాణులకుఁ బ్రాణమై పచనమ్ము గావింతు

వితతాఖిల ప్రాణితతుల హృది నేనుందు
స్మృతియు జ్ఞానమ్ము విస్మృతి నావలనఁ గల్గు
వేదవేద్యుఁడ నేన వేదాంతకారుఁడను
వేదవిదుఁడను నేన వింటివా ? విజయా !

పురుషోత్తముని......

క్షరుఁ డక్షరుం డనం బురుషు లిద్దఱు సూవె
క్షరుఁడు భూతౌఘ మక్షరుఁడు కూటస్థుండు
క్షరము నక్షరము నను పురుషులకుఁ బరుఁడైన
పురుషుఁ డుత్తముఁ డతఁడు పరమాత్మ నాఁ బరఁగు
నిరపాయుఁ డమ్మహేశ్వరుఁడు ముల్లోకముల
నిరత మావేశించి భరియించుచున్నాఁడు
క్షరమున కతీతుఁ డక్షరపురుషవరు కంటెఁ
గర ముత్తముఁడునైన పరమాత్ముఁడే నేట
నరుదుగా వేదములయందు లోకములందుఁ
బురుషోత్తముం డనం బరఁగుదున్ విజయా !

పురుషోత్తముని......

అతిరహస్య మతులమ్మైన యీ శాస్త్రమ్ము
నెలమి నిపుడు నీకుఁ దెలిపినాఁడ
దీని నెఱుఁగు వాఁడు ధీమంతుఁడు కృతార్థుఁ
డగుఁ జేమన్న ! భారతాగ్రగణ్య !

సీ. భయవిహీనత సత్వపరిశుద్ధి దానంబు
జ్ఞానయోగైకనిష్ఠయు దమంబు
యజ్ఞమ్ము స్వాధ్యాయ మార్జవంబు తపంబు
సత్య మక్రోధమ్ము శాంతి త్యాగ

మపిశునత్వ మహింస యవిలోలుపత భూత
దయ యచాపలము మార్దవము లజ్జ
తేజ మద్రోహమ్ము ధృతి యమానిత క్షాంతి
శౌచమ్ము మొదలైన సద్గుణములు

ప్రణుతదైవసంపత్సముద్భవుల కొదవు
దంభ మజ్ఞానమును క్రోధదర్పములును
బరుషతయు నతిమానమ్ముఁ బ్రబలి యుండు
నిల నసురసంపదభిసంభవులకుఁ బార్థ!

దైవసంపద మోక్షమునకుం దార్చు బంధముఁ గూర్చు నాసురి
దైవసంపదఁ బొడమితివి పార్థా! కృతార్థుఁడ వడలఁ బోకుము
దైవ మాసుర మనియు నీ భూతముల సర్గం బిరుదెఱంగుల
జీవలోకమునందుఁ గరము ప్రసిద్ధిఁ గైకొని విస్తరిల్లెడు
దైవసంపద విస్తరించుచుఁ దగ వచించితి నింక నాసుర
భావసంపద వినుతు విస్తరఫణితి వినఁగదె ఫల్గునా!

* * *

అసురజనులు ప్రవృత్తినివృత్తుల యంతరముం గన రాచారముగా
నీ సత్యముగానీ శౌచముగానీ యిసు మంతయు వారల కుండదు
సత్యము గాదు ప్రతిష్ఠయు లే దీశ్వరుఁడును లేఁ డీజగమున కందురు
నిత్యము స్త్రీపుంసోద్భవ మిది దీనికిని గామమే కారణ మందురు
వ్యగ్రదృష్టిఁ గొని నష్టాత్ములై యల్పబుద్ధు లయి లోకశత్రులై
యుగ్రకర్ము లయి లోకక్షయమున కుర్విని వారలు పుట్టుచే నుందురు
తనివి లేని కామమునకు వశులై దంభమానమదదుర్విదగ్ధులై
ఘనమోహమున దురాగ్రహపరులై కాని పనుల వర్తించుచే నుందురు
అంతు లేని ప్రళయాంతపు ఘనచింతాబ్ధి మునిఁగి కామోపభోగమే
యింతకు ఫల మిట నింతియకాక మతే మున్నదియని ముట్టఁబల్కుదురు

కామక్రోధపరాయణులై సంగతబహుళాశాపాశబద్ధులై
కామభోగములకై యన్యాయాగతధనసంచయములఁ గాంక్షింతురు
ఇది నే నిప్పుడు పొందితి మఱియును నీ మనోరథము లే నికఁ బొందుదు
నిది నా కిప్పుడు గల దిటఁ గ్రమ్మఱ నెంతో ధన మికఁ నే నార్జించెద
నీ శత్రువు నేఁ జంపితి నిం కిట నితరశత్రువుల నెల్లఁ ద్రుంతు నే
నీశుఁడ నేను బలాఢ్యుఁడ సిద్ధుఁడ నే భోగిని సుఖవంతుఁడ నేనే
నేను ధనాఢ్యుఁడ సత్కులజాతుఁడ నిట నాతో సరి యెవ్వఁడు గలఁ డీక
దానము లిత్తు యజింతు ముదమ్మునఁ దనరుదు నని యజ్ఞానమూఢులై
భూరిచిత్తవిభ్రాంతిని గైకొని మోహజాలములలోనఁ దగుల్కొని
కోరి కామభోగములకు వశులై ఘోరనరకమున వారు గూలుదురు
తమకుం దామే గౌరవించుకొని ధనమానమదాన్వితులై విధ్యు
క్తముగాఁ జేయని నామయజ్ఞముల దంభముననే యజియింతురు వారలు
అమితదర్పబలకామక్రోధాహంకారమ్ముల పాలై వారలు
తమలో నితరులలోఁ గల నన్నద్ధతి నసూయ ద్వేషించుచు నుందురు
క్రూరు లగుచు ద్వేషమ్మునఁ ననుఁ గైకొని యానరాధముల ఘోరసం
సారమ్ములలో నాసురయోనుల సతతము నేఁ బడవైచుచు నుందుదు
ఆసురయోనుల జన్మజన్మముల నట్లు పడుచు ననుఁ బొంద నేర కా
దోసకారు లగు మూఢులు సతత మధోగతి గాంతురు సూవే పార్థా!

ఆత్మనాశకమ్ములై యధోగతిఁ గూర్చు
క్రోధకామలోభకగుణగణమ్ము
నారకంపుముద్దు వారమ్ము లమ్మూటి
నడఁచి విడిచి పెట్టు మన్న! విజయ!

సీ. భూరితమోద్వారకము లగు నమ్మూఁడు దు
ర్గుణములన్ బెడఁబాపికొన్న నరుఁడు

తన యాత్మకున్ శ్రేయమ్ మొనరించు సద్యోగ
పరతమై సద్గతిన్ బడయఁ గలఁడు
కామప్రయుక్తమైన్ ఘనశాస్త్రవిధుల ను
ల్లంఘించి స్వేచ్ఛ మెలంగు వాఁడు
సంసిద్ధినిం గానిన్ సౌఖ్యమ్మునుం గాని
పరమసద్గతిఁ గానిన్ పడయ లేఁడు
కాన నిటఁ గార్య మేదొ యకార్య మేదొ
యేర్పరించుటకును శాస్త్రమే ప్రమాణ
మ ట్లగుట నీవు శాస్త్రోక్తమైన కర్మ
మాత్మఁ జెక్క నెఱిఁగి చేయుమన్న! పార్థ!

**అర్జునుఁడు:—**

శాస్త్రవిధిని విడిచిన్ శ్రద్ధతో యజియించు
నట్టి వారి నిష్ఠ యెట్టి దగునో
సాత్త్వికమ్మొ రాజసమొ తామసమొ నాకు
నేర్పరించి చెప్పవే మహాత్మ!

**కృష్ణుఁడు:—**

పార్థ! దేహులకు స్వభావసంభూతమౌ
శ్రద్ధ మూఁడు గతులన్ సంభవించు
సాత్త్వికమ్ము రాజసము తామసము నాఁగ
వినుము దాని తెలుఁగున్ వినుతు నీకు.

శ్రద్ధ దేహులకెల్ల సత్త్వానురూపముగ
సంభవించుచు నుండు శ్రద్ధామయుఁడు దేహి
యెట్టి శ్రద్ధ తనంతనే దేహి కే రీతిఁ
బుట్టునో యా దేహి యట్టిఁ డగుఁ జూవె.

సాత్త్వికులు దేవతాసమితిఁ బూజించెదరు
రాజసజనము యక్షరాక్షసులఁ బూజించుఁ
దామసజనమ్ము ప్రేతముల భూతమ్ములం
దామసశ్రద్ధమైఁ దగిలి పూజించుఁ
గామరాగము లహంకారమ్ము దంభమ్ము
గలిగి యవివేకులై కష్టాత్ము లగు జనము
లంతశ్శరీరగతుఁ డగు నన్ను దేహమున
నిరవుకొను భూతముల నెల్ల నెల్లప్పుడును
బడలువడఁ జేయుచుం గడుకొని యశాస్త్రీయ
మైన ఘోరతపమ్ము నాచరించుచు నుందు
రట్టి దుష్టారంభు లాసురవినిశ్చయో
పేతు లంచును బుద్ధి నెఱుఁగుమీ విజయ!

తిండియును జగానఁ ద్రివిధమై సంప్రీతి
గొలుపుచుండుఁ బ్రాణికోటి కెల్ల
యజ్ఞదానతపము లట్ల ముత్తెఱఁగులై
వెలయుఁ దద్విధమ్ము వినుము పార్థ!

ఆయువును సత్త్వమును నారోగ్యము బలమ్ము
సుఖముఁ బ్రీతియుఁ బెంచి సుస్థిరాతిస్నిగ్ధ
హృద్యమ్ములై రసోపేతమ్ము లగు తిండ్లు
ప్రియముఁ జేకూర్చు సాత్త్వికజనమ్ములకు
అత్యుష్ణతీక్ష్ణలవణామ్లరూక్షవిదాహి
కటువులై శోకదుఃఖమ్ములన్ రోగముల
నావహిల్లఁగఁ జేయు నాహారములు రాజ
సస్వభావులకు నిష్టము లగుం జూవె

చేక్క నుడుకనిదియు రసము లేనిదియుఁ గంపు
గొట్టు నదియును బాఁచి వట్టినది తొలినాఁటి
దళుచి మైనట్టిదియు నైన యెంగిలి తిండి
మదికి నింపౌసఁగుఁ దామసులకుం బార్థ!
ఫలకాంక్ష లేక యిప్పని శాస్త్రపద్ధతిం
గావించు చేందుకే కర్తవ్య మను బుద్ధిఁ
బూని బ్రహ్మార్పణంబుగ యజింపంబడిన
యజ్ఞమ్ము సాత్త్వికం బగుఁ జూవె విజయ!
ఫలముఁ గాంక్షించి దంభమునకై యజియించు
యజ్ఞమ్ము రాజస మ్మని యెఱుఁగు మన్న!
విధివిహీనము మంత్రవిరహిత మదక్షిణము
శ్రద్ధావియుక్తమ్ము శాస్త్రపరిదూషితము
బహుళాన్నదానసంపద్విహీనం బైన
యజ్ఞమ్ము తామసం బగుఁ జుమీ పార్థ!
దేవతల గురుజనుల ద్విజులఁ బ్రాజ్ఞుల భక్తి
నర్చించుటయు శౌచ మార్జవమ్ము నహింస
బ్రహ్మచర్యవ్రతారంభనిష్ఠ యి వెల్ల
శారీర మగు తపశ్చర్య సు మ్మనఘ!
ప్రియము సత్యం బనుద్వేగకారి హితంబు
నై వినులకును విం దైనట్టి వాక్యమ్ము
స్వాధ్యాయసంతతాభ్యాస మను నీ రెండు
వాఙ్మయతపమ్ము నా వఱలుఁ గౌంతేయ!
మౌనధారణము సౌమ్యత్వ మంతర్భావ
సంశుద్ధియు మనఃప్రసాదసంపత్తియును

నవిరతాత్మవినిగ్రహమ్ము నను నివి యెల్ల
మానసతపం బనంబడుఁ బాండుతనయ!
పటుయోగయుక్తులై ఫలకాంక్ష వర్జించి
గురుతరశ్రద్ధతో నరులు చేసిన యట్టి
కాయవాఙ్మానసాకలితమౌ నా తపము
సాత్త్వికతపం బనం జను భరతముఖ్య!
సత్కారమానపూజనములన్ మదిఁ గోరి
యతిదంభయుక్తమై నాచరింపంబడిన
యధ్రువము చంచలం బగు తపము రాజసం
బని చెప్పుదురు భారతాన్వయాభరణ!
యమితమూఢదురాగ్రహావేశమునఁ జేసి
యాత్మపీడాకరం బైన యట్టిది గాని
పరవినాశార్థమై పరఁగు నట్టిది గాని
తామసతపం బనం దగుఁ జూవె పార్థ!
దానమ్ము తనకుఁ గర్తవ్య మని తలఁచి ఫల
కాంక్ష నొందక దేశకాలపాత్రము లెఱిఁగి
పూని ప్రత్యుపకారి గాని వాని కొసంగు
దానమ్ము సాత్త్వికం బౌ నరశ్రేష్ఠ!
ఫలకాంక్షచేఁ గాని ప్రత్యుపకృతిం గోరి
కాని చేసిన దాన మాను రాజసము
దేశకాలముల పొందిక యెంచఁగాఁ బోక
సత్కరింపక యవజ్ఞాపూర్వకముగాఁగ
ధర నపాత్రుల కిచ్చు దానమ్ము తామసం
బని చెప్పుదురు దాతృజనతావతంస!

బ్రహ్మంబునకును 'ఓం తత్స' త్తని
త్రైవిధ మగు నిర్దేశము చేసిరి
బ్రాహ్మణతతి వేదములు యజ్ఞములు
పరఁగెఁ దొల్త నా నిర్దేశమ్మునఁ
గాన బ్రహ్మవాదులు సతతమ్మును
గావించెడు యజ్ఞమ్ములఁ దపముల
దానములం దొలుదొల్త 'నో' మ్మనుచేఁ
దప్పక పల్కుచుఁ జేయుచు నుందురు
దానమ్ముల యజ్ఞమ్ములఁ దపములఁ
దత్ఫలకాంక్ష యొకింతయుఁ బొందక
పూని యొనర్చెడు నప్పుడు 'త' త్తని
మును ముముక్షువులు పల్కుచు నుందురు
'స' త్తను శబ్దము సద్భావమ్మున
సాధుభావమున వాడుచు నుందురు
ఉత్తమకర్మమునందును నట్లే
'స' త్తను శబ్దము వాడుచు నుందురు
యజ్ఞతపోదానస్థితియును 'స'
త్తనియెడు పదమున వాడంబడుఁ ద
ద్యజ్ఞాదికకర్మమ్మును 'స' త్తని
యందురు సూవే భరతవరేణ్యా!

శ్రద్ధమాలి చేయుక్ సత్తపోహవనదా
నాదికక్రియాచక్యం 'బసత్తు'
నాఁగఁ బరఁగు దానక్ నరుల కిందును నందు
సుకృతఫలము లేదుక్ సూవె పార్థ!

అర్జునుఁడు:—

జలరుహాయతాక్ష! సన్న్యాస మన నేమి?
త్యాగ మనఁగ నేమి? దాని దాని
వివిధతత్త్వగతులు విస్తరించుచు నాకు
వేఱు వేఱ చెప్పవే మురారి!

కృష్ణుఁడు:—

సీ. కవివరేణ్యులు కామ్యకర్మసందోహస
న్యాసమే సన్న్యాస మని తలంతు
రఖిలకార్మణఫలత్యాగమే త్యాగమ్ము
గాఁ జెప్పుదురు విచక్షణులు మఱియుఁ
గర్మ మంతయు దోషకలిత మాటం బరి
త్యాజ్యమే యంచుఁ గొందఱు వచింత్రు
యజ్ఞదానతపఃక్రియలు మాత్ర మిట వీడఁ
గూడని వంచును గొంద ఱందు

రనఘ! యీ త్యాగవిషయమ్ము నందు నాదు
నిశ్చయ మ్మెట్టిదో వచింతు నీకు వినుము
త్యాగ మనునది మూఁడు విధములు గాఁగ
నవని నుతి కెక్కినది పూరుషాగ్రగణ్య!

యజ్ఞదానతపఃక్రియలు త్యాజ్యములు గా వవి చేయుటే తగు
యజ్ఞమును దానమును దపము బుధావళిం బావనులఁ జేసెడు
తగులమున్ విడి ఫలముఁ గోరక తత్క్రియలు గావించే చేండుటె
తగు నిదే నిశ్చితము నాదు మతమ్ము నుత్తమ మర్జునా!
నియతకర్మము లుజ్జగించుట నెరవు గా దిది తగని పని యెం
తయు విమూఢతఁ జేయు విడుపది తామసత్యాగం బగున్

కాయకష్టభయానఁ జేసిన కర్మసంత్యాగమ్ము రాజస
మా యన ర్హత్యాగమున ఫల మబ్బ దేమియు ఫల్గునా!
సంగఫలముల విడిచి యిప్పని సలుపఁదగు నని చేయు కర్మము
సంగత మ్మగు నట్టి త్యాగము సాత్త్వికము సు మ్మర్జునా!

మంచివి గా వని కామ్యకర్మముల
మది ద్వేషింపఁడు నిత్యకర్మములు
మంచి వటంచేను సక్తిం బొందఁడు
మానితసత్త్వసమన్వితుఁడై సము
దంచితమేధాసంయుతుఁడై పర
తత్త్వవిదుం డయి గతసంశయుఁడై
మించెడు త్యాగి క్రియాఫలసంగస
మీహావర్జితకర్మయోగియై
కర్మము లన్నియుఁ ద్యజియించుట శ
క్యము గా దెట్లును దేహధారులకుఁ
గర్మఫలైకపరిత్యాగియె లో
కమ్మునఁ ద్యాగి యనంబడు విజయా!
ఇష్ట మనిష్టము మిశ్రము నని యెడు
నీ త్రివిధ మ్మగు కర్మఫల మ్మట
నష్టాత్మ్మల కత్యాగుల కగు స
న్యాసుల కెందును నంటదు పార్థా!

సీ. సకలక్రియాసిద్ధికి సాంఖ్యసిద్ధాంతాను
సారమ్ముగా నైదుకి కారణములు
గల వధిష్ఠానమ్మ్ముకి కర్త పృథగ్విధ
కరణమ్ము వేర్వేఱుకి కలుగు చేష్ట

లివి నాల్గు దైన మైదవది యా నిందుఁ ద్రి
కరణమ్ములం బూని నరుఁడు చేయఁ
గడఁగు న్యాయ్యాన్యాయ్య కర్మమ్ములకు నెల్ల
నీ వైదె హేతువులై యెసంగు

నందు యాథార్థ్య మిటు లుండ నకృతబుద్ధి
యగుట నెవఁ డాత్మయే కర్త యని తలంచు
నట్టి దుర్మతి తత్త్వమ్ము నరయు వాఁడు
గాఁడు భరతాన్వవాయసాగరశశాంక !

ఆత్మభావమం దహంకృతి లేని వాఁ
డొకట బుద్ధి నంట కుండు వాఁడు
లోకహంత యయ్యు లోకహంతయుఁ గాఁడు
కర్మబద్ధుఁ డతఁడు గాఁడు పార్థ !

జ్ఞానము జ్ఞేయము జ్ఞాతయు నన లో
కానఁ గర్మచోదన త్రివిధ మ్మగుఁ
గరణము కర్మము కర్తయు ననఁగాఁ
గర్మసంగ్రహమ్మును ద్రివిధం బగు
జ్ఞానము కర్మము కర్తయు గుణసం
చయభేదమ్మునఁ ద్రివిధంబే యగుఁ
గాపిలగుణసంఖ్యానోక్తం బిది
కడుకొని వినిచెద వినవే విజయా !

వేఱువేఱుగ నుండు వివిధభూతములలో
వేఱు లే కొకటియై విలసిల్లు చున్నట్టి
యవ్యయం బైన యధ్యాత్మవస్తువుఁ జూపు
జ్ఞానమ్ము సాత్త్వికముగా నెఱుఁగుమన్న !

వివిధభూతములలో వేర్వేఱు విధములన్
వివిధాత్మవస్తువులు విలసిల్లు చున్నట్లు
వివిధభావములతో వేర్పాటుగాఁ జూపు
జ్ఞానమ్ము రాజసము గా నెఱుఁగు మనఘ!
ఒక కార్యవస్తువున సకల మిటఁ గల దన్న
నెఱనమ్మికఁ దవిల్చి నిర్హేతుక మ్మగుచుఁ
దత్త్వార్థశూన్య మత్యల్పమ్ము నైనట్టి
జ్ఞానమ్ము తామసము గా నెంచు మయ్య!
ఫలతృష్ణ లేక నిర్భరసక్తిఁ గైకోక
రాగవిద్వేషదుర్గతుల పొంతను బోక
కర్తవ్యబుద్ధితోఁ గావింపఁబడినట్టి
కర్మం బరయ సాత్త్వికము సూవె పార్థ!
కోర్కెయు నహంకృతియుఁ గొని మహాయాసమున
రహిఁ జేయు కర్మమ్ము రాజసము విజయ!
కలుగు ఫలితము నిజక్షయము మఱియును బర
ప్రాణిహింసయు నాత్మపౌరుషము కొలఁదియును
నరయఁగా లేక మోహమునఁ జేయంబడిన
కర్మమ్ము తామసము కౌరవవరేణ్య!
తగుల మొల్లక యహంతాగుణమ్ముఁ దొఱంగి
ధృతియు నుత్సాహమ్ము మతిఁ బాదుకొనఁ జేసి
మొనయు సిద్ధిని నసిద్ధిని నిర్వికారుఁడై
విలసిల్లు కర్త సాత్త్వికుఁడు కౌంతేయ!
రాగవంతుఁడును గర్మఫలార్థియును లోభి
శౌచహీనుండు హింసారిరంసాత్మకుఁడు

హర్షశోకాన్వితుం డగు కర్త రాజసుం
డని చెప్పుదురు భారతాన్వయాభరణ!
ప్రాకృతుం డయుక్తుండు పరవిభేదనపరుం
డత్యంతమాయావి యలసుండు స్తబ్ధుండు
దీర్ఘసూత్రియు విషాదియు నైన కర్త తా
మసుం డంచుం దెలియం దగు నసమానతేజ!

త్రిగుణములనుబట్టి త్రివిధభేదములు బు
ద్ధికిని ధృతికిం గలిగి యతిశయిల్లు
వేఱు వేఱ వానిి విస్తరించి వచింతు
వినం గదన్న పాండువిభుకుమార!

ఆర్య! ప్రవృత్తినివృత్తులం గార్యా
కార్యమ్ములను భయాభయముల మఱి
బంధము మోక్షము నెఱింగెడు బుద్ధి శు
భంకరి సాత్త్వికి యనంబడుం జూవే
ధర్మ మధర్మము కార్య మకార్యము
దగ నెఱుంగని దగు బుద్ధియ రాజసి
ధర్మ మధర్మముగా నిటు సర్వా
ర్థములను విపరీతముగా నెంచుచు
భూరితమోగుణకలుషీకృత యగు
బుద్ధి జగమ్మునం దామసి యనంబడు
సర్వమనః ప్రాణేంద్రియచేష్టల
శాస్త్రపథమ్మును దాంటంగనీయక
యోగసమాధిని ననుగామినియై
యుల్లసిల్లు ధృతి సాత్త్వికి యందురు

ధర్మముఁ గామము నర్థముఁ గూర్పఁగఁ
దాఁ దోడ్పడుచేను దత్ప్రసంగమునఁ
దత్తత్ఫలములయందును గోర్కులు
దార్కొనఁ జేసెడు ధృతి రాజసి యగు
స్వప్నము భయమును శోకము మదము వి
షాదము నిడు ధృతి తామసి పార్థా!

భరతకులవతంస! నరునకు నలవాటు
వలనఁ బ్రీతి గూర్చి వంతఁ బాపు
నట్టి సుఖము త్రివిధమై యొప్పు నిట నీకు
వినుతు దాని తెఱఁగు వినఁ గదన్న!

తొలుత విసముగఁ దోఁచి పదపడి
తుదిని దా నమృతోపమం బయి
కలఁత మానిచి బుద్ధిఁ దేర్చు సు
ఖమ్ము సాత్త్విక మర్జునా!
మొదట నింద్రియవిషయసంగతి
నొదవ నమృతప్రాయమై తుది
నదియ విష మగు సుఖము రాజస
మని యెఱుంగుము ఫల్గునా!

మొదలఁ దుది మోహమును గొల్పుచు
నిమర నలసతఁ గడుఁ బ్రమత్తత
నొదవు సుఖ మది తామసం బగు
యుద్ధకర్మవిశారదా!

ప్రకృతివలన జగతిఁ బ్రభవించి నట్టి యా
త్రిగుణములకు వెలిగ నెగడు ప్రాణి

యీ త్రిలోకమందున్ నేదియో నొకటియుం
గూడ లేదు సూవెన్ కురువరేణ్యా !

సీ. శమదమార్జవతపన్శౌచక్షమాస్తిక్య
ములు జ్ఞానవిజ్ఞానములు స్వభావ
భవములౌ కర్మముల్ బ్రహ్మజాతికి శౌర్య
తేజముల్ దక్షతన్ ధృతియు దాన
మైశ్వరమును బోరన్ నపరాఙ్ముఖతయు నై
సర్గికకర్మముల్ క్షత్రియులకు
వాణిజ్యకృషిపాశుపాల్యముల్ వైశ్యక
ర్మమ్ములు శూద్రకర్మమ్ము సేవ

జగతిఁ గడఁక నిట్లున్ స్వస్వకర్మకాభి
నిరతుఁ డైన నరుఁడున్ పొరయు సిద్ధి
స్వీయకర్మరతుఁడున్ సిద్ధి నెవ్విధమునం
గనునో దాని వినుతున్ వినుము పార్థ !

సీ. ఎవనిచే భూతప్రవృత్తి సాఁగుచు నుండు
నిఖిలమ్ము నెవ్వాఁడున్ నిండియుండు
నా యనంతుఁ బరేశున్ స్వీయకర్మమ్ముచే
నర్చించి సంసిద్ధిన్ నందు నరుఁడు
చేకూఁ జేసెదు నన్యజాతిధర్మముకంటె
నస డైనను స్వధర్మన్ మొసఁగు మేలు
స్వకులోచిత మ్మై యొసంగు కర్మము నరుం
డొనరించి కిల్బిషమున్ బొందఁబోఁడు

సహజ మగు కర్మ మది దోషన్ సహిత మైన
వీడఁ గూడదు పొగతోడఁన్ గూడు నగ్గి

కైవడిని దోషయుక్తమ్ము గాని కర్మ
మేదియును నీ జగమ్మునన్ లేదు పార్థ!

ఎందు నేనిఁ దగుల మొంద కాత్మను నిగ్ర
హించి తృష్ణ పోం దడంచినట్టి
నరుఁడు పరమమైన నైష్కర్మ్యసిద్ధి స
న్న్యాసయోగయుక్తి నధిగమించు.

మానసీయసిద్ధి నొందు మానవుండు బ్రహ్మపదముఁ
దా న దెట్లు పొందఁ గలఁడో దాని తెఱఁగు నెఱుఁగు మీవు
నేను సంగ్రహముగ నిపుడు నీకుఁ దెలుపువాఁడఁ బార్థ!
జ్ఞానమునకుఁ బరిసమాప్తి యైన నిష్ఠ యది సుమీ!

సీ. అతిశుద్ధబుద్ధియై ధృతి నాత్మ నియమించి
శబ్దాదివిషయసంచయము విడిచి
రాగవిద్వేషసంరంభముం బోకార్చి
యతవాఙ్మనఃకాయుఁడై వివిక్త
సేవియై లఘుభోజియై విరక్తి వహించి
నిత్య మాత్మధ్యాననిష్ఠఁ బూని
మమకారదర్పకామక్రోధబలపరి
గ్రహదూరుఁడై యహంకార మెడలి

పూతుఁడై శాంతుఁడై బ్రహ్మభూతుఁ డైన
జనుఁడు సుప్రసన్నాత్ముఁడై సర్వభూత
సమత గైకొని శోకతృష్ణలఁ దొఱంగి
పరమమైన మద్భక్తిని బడయు విజయ!

భక్తియుక్తి నతండు తత్త్వమున నేన
దెట్టివాఁడను యెవఁడనో యెఱుఁగ నేర్చుఁ

దత్త్వగతి నన్నెఱింగి యాపైతండు పిదప
ననుఁ బ్రవేశించెడుం జూవె నరవరేణ్య!

సర్వకర్మములను సతతమ్ము చేయు వాఁ
డయ్యు భక్తి నన్ను నాశ్రయించి
యతఁడు నాయనుగ్రహమున శాశ్వత మవ్య
యమ్ము నైన మత్పదమ్ముఁ బొందు.

బుద్ధియుక్తిని సర్వకర్మంబులను నా కర్పించి మత్పర
బుద్ధివై నాయందుఁ జిత్తముఁ బూని నిల్పుము ఫల్గునా!
మానసము నాయందు నిలిపిన మత్కృపన్ దుర్గముల దాఁటెద
వీ నుడుల దురహంకృతిన్ వినవేనిఁ జెడిపోద వర్జునా!

దురహంకృతిఁ గొని దురము సేయ నని
తొలఁగుదువే నీ తలఁపు వృథా యగు
నురుమోహమ్మున నీవు సేయఁగా
నొల్లని పనియె స్వభావరూఢదు
స్తరనిజకర్మనిబద్ధుఁడవై యిటఁ
దప్పక చేయక తీఱదు నీకుం
బరవశతం బ్రకృతియె నీచే ని
ప్పని చేయించెడుఁ జూవే పార్థా!

సర్వభూతముల మాయాశక్తిని
జంత్రముపై కెక్కించెడు చోద్యపు
సర్వభూతహృదయమ్ముల నెలకొని
సర్వేశ్వరుఁడే త్రిప్పుచు నుండును
సర్వభావమున నాసర్వాత్మునె
శరణు సొరుము తదనుగ్రహమునఁ బర

నిర్వృతిఁ గైకొని శాశ్వతపదమును
నీ వొందెదవు సు మన్నా! విజయా!

అతిరహస్య మైనట్టి యీ జ్ఞానమ్ముఁ
జెలిమి నిట్లు నీకుఁ జెప్పినాఁడ
నుల్లమున ని దెల్ల నూహించి నీ యిచ్చ
వచ్చి నట్లు సేయవచ్చుఁ బార్థ!
ఆర్యవర్య! మరల నఖిలగుహ్యతమమ్ము
పరమ మైన నాదు పలుకు వినవె
యీవు నాకు మిగుల నిష్టుండ వగుటచే
నోలి హితముఁ జెప్పుచున్నవాఁడ

నాపై మన సిడి ననుఁ బూజింపుము
నాకున్ మ్రొక్కుము నా భక్తుఁడ వగు
మీ పగిదిం జేసిన ననుఁ బొందుదు
విది నా నిక్కపుఁ బ్రతిన సుమన్నా!

సర్వధర్మము లుడిగి నన్నే
శరణుఁ బొందుము నిన్నుఁ దప్పక
సర్వపాపవిముక్తుఁ జేసెద
సత్య మడలకు మర్జునా!

దీని మద్భక్తుండు గాని వానికిని
మానితతపశ్చర్య లేని వానికిని
పూనిక నశుశ్రూషు వైన వానికిని
లో నా యెడ నసూయఁ బూను వానికిని
వినిపింపకుము పార్థ!
వినిపింపఁ బోకు.

ఈ పరమగుహ్యమును నాపాదభక్తులకు
నా పయిని సంతతము నేపారు భక్తి నెవఁ
డోపి వచియించునో యాపురుషశేఖరున
కా పరమభక్తునకు నా పద మొదవు నిందు
సందియము లే దన్న !
సందియము లేదు.

అట్టివానికంటె మనుజులందు నాకుఁ బ్రియము సేయు
నట్టివాఁడు మఱి యెవండు నవనిలోన వేఁడు లేఁడు
అట్టివానిఁ బోలు మత్ప్రియంకరుండు ప్రియుఁడు భువిని
బుట్టఁబోఁడు మఱి యొకండు పుట్టఁబోఁడు ఫల్గునా !

మానితధర్మోపేత మయిన యీ
మన సంవాదముఁ జేదివిన వానిని
జ్ఞానయజ్ఞమున ననుఁ బూజించిన
వానిఁగ నెంచెదఁ జూవే విజయా !

శ్రద్ధతో ననసూయులై విను జనులు గూడ విముక్తి నొందిన
మృద్ధశుభకరలోకముల వసియించెదరు భరతర్షభా !

వింటివా యిదెల్ల మదిని
గొంటివా తదర్థ ముఖపు
కొంటివా విమోహాతమము
మంటివా. ధనంజయా !

అర్జునుఁడు:—

స్నేహాకరుణాయుక్తి నీ విటుఁ
జెప్పినది మది నెఱిఁగికొంటిని

మోహసాగర ముత్తరించితి
ముదముమై స్మృతిఁ గొంటి నా సం
దేహ మంతయుఁ దీఱిపోయె న
తిస్థిరాత్ముఁడ నైతి నమితో
త్సాహినై నీ పనుపు సేసెద
సర్వలోకనియామకా!

సక్తిఁ గొని మమకారమోహా
ద్రిక్తమతినై కుందు నాకున్
ముక్తిమార్గముఁ జూపి శోకవి
మోహములఁ బెడఁబాపి యోగో
ద్యుక్తచిత్తునిఁ జేసి నన్ను స
ముద్ధరించితి వీశ్వరా! నీ
భక్తలోకోద్ధరణ దీక్షను
బ్రస్తుతింపఁగ శక్యమే?

"సర్వధర్మము లుడిగి నన్నే
శరణు పొందుము నిన్నుఁ దప్పక
సర్వపాపవిముక్తుఁ జేసెద
సత్య మడలకు" మంచు నాకున్
సర్వలోకాధీశ! యభయ మొ
సంగినా విది చాలు సర్వము
నిర్వహింపఁగఁ జేయు భర మిఁక
నీదెకా సర్వాత్మకా!

అర్థి ననుఁ గరుణించి సకలా
జాండరథసారథివి నీ విటు

పార్థసారథి వైతి నాదగు
భాగ్య మే మని చెప్ప సర్వేశు
భార్థముల నొడఁగూర్చి భక్తుల
కండవై ని వుండఁగాఁ బ్ర
త్యర్థివిజయము బ్రాఁతియే శర
ణార్థి నగు నా కచ్యుతా!

శరణు భక్తలోకపాల! శరణు ఘనకృపావిలోల!
శరణు యోగిహృన్నివాస! శరణు పరమచిద్విలాస!
శరణు వినతపాపహరణ! శరణు సకలలోకభరణ!
శరణు భవపయోధితరణ! శరణు శరణు మాధవా!

( శ్రీకృష్ణునకు సాష్టాంగదండప్రణామ మాచరించెను. )

కృష్ణుఁడు:—

( అభయహస్త మెత్తి )

లే లెమ్ము; విజయ! విజయీభవ!

అర్జునుఁడు:—

( లేచి యుద్ధసన్నద్ధుఁడై గాండీవముఁ గైకొని, కవదోనలు బిగియించి, నారి సారించి, దేవదత్తము పూరించెను. )

కృష్ణుఁడు:—

( పాంచజన్యము పూరించి చిఱునవ్వుతో రథ్యముల నూల్కొలుపును. )

అర్జునుఁడు:— ( వీరావేశముతో )

కృష్ణా! అరదమ్ము సత్వరమ్ముగాఁ బోనిమ్ము.

మెండుకొను భీతిఁ గలగుండు వడి బిట్టొదిగి
దండిమగ లెల్లఁ గను బెండువడి చూడఁగన్

మండుచే జగత్ప్రళయతాండవ పరుం డయిన
ఖండపరశుం డనఁగ భండనమునందున్
మొండెములు రాల గజతండములు గూలఁ గుజ
నుం డగు సుయోధనుని గుండియలు వ్రీలన్
గాండివవిముక్తశితకాండతతులం బఱపి
చెండెదఁ జమూచయముఁ జండభుజశక్తిన్.

( కృష్ణార్జునులు రథముతో నిష్క్రమింతురు. )

( తరువాత సంజయుఁడు ప్రవేశించును )

**సంజయుఁడు:—**

ఆహా ! శ్రీవ్యాసభట్టారకుని మహాప్రసాదమున నా జన్మము ధన్య మైనది గదా !

మహాత్ము లైన శ్రీకృష్ణార్జునుల మహాద్భుతసంవాదమును వింటిని.

( గగుర్పాటు నభినయించి )

నా యొడలు గగుర్పొడుచు చున్నదే ! అహాహా ! యోగేశ్వరుం డైన సాక్షాత్కృష్ణభగవానుఁడు స్వయముగా నర్జునునితోఁ జెప్పుచుండఁగాఁ బరమగుహ్యతమం బయిన యా యోగశాస్త్రమును వింటిని.

( మాటిమాటికిఁ దలంచుకొనుచు మహానందముతో )

ఆహా ! మహాయోగిజనైకగమ్య మైన పరమయోగశాస్త్రము —బ్రహ్మవిద్య—ఉపనిషద్విద్య—శ్రీభగవద్గీతామృతము—వీనుల విందుగాఁ గ్రోలఁ గలిగితిని. ఏమి నా యదృష్టము !

( మరలఁ దలంచుకొని )

ఓహో ! ఆ పరాత్పరుని విశ్వరూపముఁ గనుఁగొంటిని. ఏమి యీ మహాద్భుతరూపము !

( మరల మరలఁ దలంచుకొనుచు )

ఆహా ! కన్నులఁ గట్టిన ట్లున్నదే !

మహాద్భుతరూపము ! దేవతలకును జూడ నలవి గాని రూపము! బ్రహ్మాండముల నిండి యేకాకృతిని వెలుఁగుచున్న రూపము! కనుఁగొంటిని,— విశ్వరూపుని దివ్యరూపమును గనుఁగొంటిని. ఏమి నా భాగ్యము !

ఎచ్చట యోగేశ్వరుఁడు కృష్ణుం
డెచ్చట ధన్వి కిరీటి యుండును
యచ్చట సిరియును భూతి నీతి జ
యమ్ముఁ దప్పక యుండెడున్.

నేఁటి తొలినాఁటి పోరు చూచి కరినగరికిం బోయి యిది యంతయు ధృతరాష్ట్రునకు వినిపించెదఁ గాక.

* * * *

పాలు పిదుకఁగఁ బూని ప్రాఁబలుకుఁ దుదిపలుకు
టాలమందలను గోపాలకృష్ణుఁడు గూర్చి
లీలఁ దొలి క్రీడి యను లేఁగదూడం గుడిపి
యాలపొదుగులఁ జేఁపు జొలుకొని వెలి విరియ
నోలి గీతామృతపుఁ బాలు దాఁ బిదికి యీ
నీలవర్ణుం డిదే నెఱచూఱ లిడినాఁడు—

భగవత్ప్రసాదలబ్ధము లైన పాలు
త్రిగుణభవతాపతృషఁ బాపఁ గల పాలు
అగణితామృతసిద్ధి నందించే పాలు
మగుడఁ బుట్టువు నీని మామంచి పాలు

గ్రోలుఁడీ బుధులార !
గ్రోలుఁ డీ పాలు.

మంగళము భక్తార్తిభంగకారికృపాతరంగితోజ్జ్వలశుభాపాంగున కసంగునకు
భద్రమ్ము దేవతావిద్రావకర్వితక్షుద్రదానవవధోన్నిద్రునకు భద్రునకు
కళ్యాణ మురుతరామూల్యైకఖగవాహపల్యంకికారోహలౌల్యునకుఁ గల్యునకు
శ్రేయమ్ము కౌస్తుభమణీయుతనిజోరస్స్థలాయతనపద్మానపాయునకు గేయునకు
శౌరికి మురారి కఘదూరున కుదారునకు
జిష్ణునకు శ్రీకృష్ణునకు సదా
మంగళము
నిత్య జయమంగళ మొసంగుత సతమ్మున్.



సంపూర్ణము.



శ్రీరామకృష్ణపరబ్రహ్మార్పణ మస్తు.

